

Chandamama Jan. '49

Photo by K. Muthuramalingam

అన్నదమ్ములు

సంక్రాంతికి ఆంధ్రదేశమంతటా విడుదల!

రాజకుమారి... చిన్నప్ప నటించిన
కృష్ణాపిక్చర్సు వారి,

# కృష్ణభక్తి




సరస్వతీ టాకీస్ వారి రిలీజ్....

# చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



ఇవన్నీగాక పజిలు, ముగ్గులు, చిక్కుచదరాలు, చిక్కుబొమ్మలు, ఇంకా, ఇంకా ఎన్నోవున్నై.


చందమామ ఆఫీసు
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.



# అభినందనములు

మా చిన్నిపాఠకులకు

నూతన సంవత్సరము మీకు మంగళకరమగుగాక!
మీ బుద్ధికుశలతను అధికపరచే రసభరితమైన
విషయములను ఎప్పటివలె మీకు అందజేస్తాము.

మా "భూమినుండి సంపద" అనేసరణిని వచ్చే సంచికనుండి
తిరిగి ప్రారంభిస్తాము.

---

ది తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

## 'చందమామ' కు ఏజంట్లు కావాలి



ఏజంట్లు లేనిచోట్ల ప్రతి వూరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిన మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు మాకు వ్రాయండి.

**చందమామ ఆఫీసు,**

పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు - 1.

CP/274



## ఉరుకులు, పరుగులు

మీ పిల్లలకు చక్కటి, రంగు రంగుల బట్టల కొనండి. బట్టల్లో వాళ్లు ముచ్చటగా అగుపడేట్లు చూడండి. పాఠాలపని అయిపోగానే ఏం తమాషా, ఏం ఆటలు. ఇంట్లో కట్టుకునేందుకైనా, బయటికి వెళ్లేప్పుడు కట్టుకునేందుకైనా, అచ్చటకైనా ముచ్చటకైనా ఆటపాటలతో క్కిడి కాగేందుకైనా మద్రాసు సహకార చేనేత వస్త్రాలు రకరకాలవిఉన్నవి. మీపిల్లల్ని యం. సి. హెచ్. సేల్సు ఎంపోరియంకు తీసుకువెళ్లి వాళ్ళకు నచ్చిన రంగులను, మాదిరీలను వాళ్ళనే కోరుకొననివ్వండి.




పిల్లలు ముచ్చటపడేవి అన్ని
చెక్కులు, అద్దకాలు, గింఘంలు, విందు గుడ్డలు, ఇంటికీ, నర్సరీకి అలంకరణ గుడ్డలు, జేబు రుమాళ్ళు, నాప్‌కిన్సు, తుండ్లు, పక్క దుప్పట్లు.

మద్రాసు హేండ్‌లూం వీవర్సు ప్రావిన్షియల్
కో-అపరేటివ్ సొసైటీ, లిమిటెడ్.,
'హాలోవేస్ గార్డెన్సు', 34, పాంతియన్ రోడ్డు, ఎగ్మూరు, మద్రాసు.

ఆంధ్రదేశమంతటిలోను సంక్రాంతికి

విడుదలగును

# జెమిని

# చక్రధారి

మనసును కలచివేయు అద్భుతసంఘటనలతో
నిండిన అపురూప చలనచిత్రము

ఇప్పుడు మద్రాస్‌లో క్రౌన్, స్టార్ థియేటరులలోను
ఇతర ముఖ్యకేంద్రములలోను ప్రదర్శింపబడుచున్నది

నాగయ్య, పుష్పవల్లి, నారాయణరావ్ నటించినది..... డైరెక్షన్: K. S. గోపాలకృష్ణన్






సంపుటి 4
సంచిక 1

సంచాలకుడు: చక్రపాణి

జనవరి
1949

# సంక్రాంతి పండుగ

పాపాయిలూ! మనకు ముఖ్యపండుగ సంక్రాంతి వస్తున్నది. ఇది ఏ ఒక్క మతంవారి పండుగా కాదు. భాగ్యవంతులకూ, బీదలకూ అందరికీ పండుగ. అందరూ ఈ పండుగ ఎంతో సంతోషంతో చేసుకుంటారు. ఇంత సంతోషానికి కారణం ఏమిటో తెలుసునా? సంక్రాంతినాటికి మన భూములన్నీ పంటలు పండుతై; చాలాభాగం పంట యిళ్లకుకూడా వస్తుంది. పశువులకు మంచి మేతవుంటుంది. బిచ్చగాళ్ళకు బిచ్చం దొరుకుతుంది. బీదవాళ్లకు పని దొరుకుతుంది. బీదా, బక్కా అందరి చేతుల్లోనూ డబ్బు మెదులుతూ వుంటుంది. అందరూ కడుపునిండా తింటూ సంతోషంగా వుంటారు. ఇంతకంటే నిజానికి పెద్దపండుగ ఏముంది?

మీ చందమామ.




పాపలూ! ఇక్కడ పన్నెండు కుక్కలు వున్నయి చూశారూ. ఈ పన్నెండూ చూడటానికి ఒకేమాదిరిగా కనిపిస్తున్నా నిజంగా అలా లేవు. రెండు కుక్కపిల్లలు తేడాగా వున్నయి. ఆ రెండు ఏవో కనుక్కోండి.

మీరు కనుక్కోలేకపోతే జవాబుకి చివరి పేజీలలో చూడండి.



పిల్ల : నాకు కాసిని నీళ్లు కావాలి, కొళాయి వదులుతావా ?

పిల్లి : ఉహుఁ. నాకు పాయసం యిస్తేనేగాని కొళాయి వదలను.





# తోటమాలి

తోటమాలి బావినీళ్ల
తోడ బోవుచు,
అంగవేసి నీళ్ళలోకి
తొంగిచూచెను.
నిప్పుముద్ద వంటి ప్రొద్దు
నీళ్ల లోపల,
ప్రతిఫలిస్తు వానికంట
బడ్డ దంతట.
భార్య నతడు పిలిచి "చూడు
సూర్యు నెవ్వరో,
బావిలోన ద్రోసినారు
పాప మాయన ;
ఇంక చావనట్టు లున్న
దివలి కీడ్తము
క్రింది మచ్చుమీద గాల
ముంది తె"మ్మనెన్.
ఆలి దుటికి తేగ నాత
డందుకొనియెను ;
చేదగట్టి బావిలోకి
చేరవిడిచెను.
గాల మడుగు పట్టి రాతి
మూల నిరికెను,
పైకి చేదబోవ రాక
పట్టుపట్టెను.

రచన:

## ఏటుకూరి

మగని జూచి భార్య చంక
ఎగురవేయుచు,
"ఇందు తగులుకొన్న దివలి
కీడ్వ"మనియెను.

మగడు త్రాడుపట్టి బిఱ్ఱ
బిగిసి లాగగా,
కొక్కెమూడి వెల్లికలుగ
కూలబడియెను;

వెన్నుపూస విఱిగి నాల్క
వెళ్లబెట్టెను.
పెండ్ల మావురన్న దతడు
పెనగి లేచుచు

మింటివైపు చూచి "సూస్తి
వంటె సూర్యుడు,
ఒక్కదెబ్బ కెగిరి బావి
నుండి మింటికి,

టాకి నిల్చినాడు నా త
డాక తెలిసెనా?"
అంటు సగము తెగినచేద
నతడు లాగెను,
వింటు భార్య పైకి చూచి
విస్తుపోయెను.





# మే మే మేకపిల్ల

అనగనగా ఉఫ్ఫ్ అని ఒక ఎర్రటి మేక వుండేది. ఆ మేకకు నాలుగు పిల్లలు పుట్టాయి. నాలుగుపిల్లలలోనూ మూడు తల్లిపోలిక. కడసారిది మాత్రం కారు నలుపు. దీనికి మేమే-మేకపిల్ల అని పేరు. ఈ సంతతిలో మూడు పిల్లలూ తల్లిచెప్పిన మాట విని బుద్ధిగా ఉండేవి. కాని మేమే-మేకపిల్ల మాత్రం గడుగ్గాయగా తిరుగుతూ, తగని అల్లరి చేస్తూవుండేది.

ఒకరోజున మేమే-మేకపిల్ల తల్లిదగ్గిరకు వెళ్లి, "అమ్మా అమ్మా! నాకు ఢిల్లీసుల్తానుని చూచిరావాలెనని వుంది. మనిద్దరం కలిసి వెళదాము. లే, బయలుదేరు" అన్నది.

దానికి తల్లిమేక "పాపా! ఇప్పుడు నాకు చేతినిండా బోలెడంత పని వున్నది. అదీ గాక, ఇంత చిన్నవాళ్లేమిటి, ఢిల్లీ వెళ్ళడమేమిటి, సుల్తానుని చూడడమేమిటి? మీరు పెద్దవాళ్ళయిన తరవాత అందరం కలిసి వెళదాములే" అని చెప్పింది.

"అఁ? పెద్దయేవరకూ ఎవరు ఆగుతారేమిటి? వస్తే ఇప్పుడు రండి, లేకపోతే పొండి, మీ యిష్టం. ఇదుగో నేను బయలుదేరి పోతున్నాను" అని, మేమే-మేకపిల్ల రోడ్డుమీదికి పరుగెత్తింది.

అటువంటి అల్లరిపిల్లలతో చేసేది ఏమిటి? "సరే, అనుభవించు, నీ ప్రారబ్ధం. నిన్ను కన్నానుగాని నీ రాతను కనలేదు కదా?" అనుకుని విచారించింది తల్లిమేక.

మేమే-మేకపిల్ల పాడుకుంటూ గంతులేస్తూ పోతూవుంటగా దారిలో ఒక యేరు అడ్డం వచ్చింది. ఏరు మేకమ్మనుచూసి, "మేకమ్మా మేకమ్మా! నాపైనఎవరో కొమ్మ పడవేసి పోయినారు. అది నాకు బరువై పోయి నడవలేకుండా వున్నాను. దానిని కాస్త నమిలేసిపో తల్లీ, నీకు పుణ్యం ఉంటుంది" అని బతిమాలింది.

"పాపం, రమ్మన్నారు తిమ్మన్న బంతికి. కొమ్మలు తినటమే పని అనుకున్నావా

ఆర్. శకుంతల, బాపట్ల

నాకు? ఢిల్లీకి పోవాలి, సుల్తానుని చూడాలి. ఇప్పుడు నాకు తీరికలేదు " అని చేప్పేసి, మేమే-మేకపిల్ల మళ్లీ పాడుకుంటూ గెంతు కుంటూ వెళ్లిపోయింది.

మరి కొంతదూరం వెళ్లేసరికి, ఒక మండుతున్న మంట కనపడి, "మేకమ్మా మేకమ్మా! నేను ఆరిపో బోతున్నాను. అల్లదిగో నీ కాలిదగ్గర ఒక పుల్ల ఉన్నది. అది కాస్త ఇలా పడవేసిపో తల్లీ, నీకు పుణ్య ముంటుంది"అని బతిమాలింది.

ఏరుకు చెప్పినట్టుగానే మంటకుకూడా చెప్పివేసి మేకపిల్ల పరుగెత్తిపోయింది.

మరికొంచెం దూరం పోయేసరికి, ఒక చెట్టుకింద గాలి కనపడింది. " మేకమ్మా మేకమ్మా! ఈ చెట్టుకి ఎవళ్లో ముళ్లకంచె కట్టారు. అది నా వీపుకి గుచ్చుకుంటున్నది. దాన్ని కాస్త లాగిపారెయ్యి తల్లీ, నీకుపుణ్య ముంటుంది" అని బతిమలాడింది గాలి.

నీళ్ళకూ, మంటకూ చెప్పినట్టుగానే గాలికికూడా చెప్పేసి మేకపిల్ల పరుగెత్తి పోయింది.

వెళ్లి వెళ్లి మేమే-మేకపిల్ల చివరకు ఢిల్లీ సుల్తాను కోట చేరుకున్నది. ఆ దారిని పోతూవున్న మనిషిని పిలిచి, " సుల్తాను



ఎక్కడ వున్నాడు? నేను చూడాలి" అని అడిగింది. అతను సుల్తానుగారి వంటల సాయిబు. "రా, రా, నీకు సుల్తాను కావాలా ? నేను చూపిస్తాను రా" అంటూ పకపక నవ్వి మేమే- మేకపిల్లను వంటింటి లోకి లాగుకొని పోయాడు. అతను పొయ్యి రాజవేసి, పెద్ద డేగిశా నీళ్లూ పెట్టి, అందులో మేకపిల్లని ఉంచి, డేగిశా మూసిపోయాడు.

పాపం మేమే-మేకపిల్లకు భయం పట్టు కుంది. నీళ్లవైపు చూసి, "నీళ్లూ నీళ్లూ! మీరు కాగబోకండి. మీరు కాగారంటే నేను ఉడికి చచ్చిపోతాను" అని బతిమాలింది.

"మాకు కష్టం వచ్చినప్పుడు ఆర్చినావా తీర్చినావా ? మేము కాగేది కాగేదే" అని నీళ్లు బుడ బుడ కాగడం మొదలెట్టినయి.

అప్పుడు మేకపిల్ల నిప్పువంక చూసి, "నిప్పూ, నిప్పూ! నువు రాజుకోవద్దు. నువు మండినావంటే నేను ఒళ్లు కాలి చచ్చి పోతాను" అని బతిమలాడింది. నిప్పు కూడా నీళ్ళలాగానే చెప్పి, మండసాగింది.

చివరకు మేకపిల్ల గాలితో "గాలీ, గాలీ! నువు వీచవద్దు. నీవువీచితే నిప్పు మండు తుంది. నిప్పుమండితే నీళ్లు కాగుతై. నీళ్లు కాగితే నేను వళ్లు కాలి చచ్చిపోతాను. నా మీద దయతలచవా?" అని బతిమాలింది.

గాలికి మేకపిల్లమీద జాలి కలిగింది. "ఇందాక దారిలో నేను నిన్ను సహాయం చెయ్యమని అడిగితే, 'అబ్బో, నాకు పని వుంది' అని చెప్పి పరిగెత్తుకు పోయావ్. ఇప్పుడు నీకే నాసహాయం కావలసొచ్చింది. చూశావా పాపా! ఏ వేళకు ఎవళ్లఅవసరం వస్తుందో! అందుచేత ప్రపంచంలో ఎవళ్ళ తోనూ విరోధం పెట్టుకో కూడదు. ఇప్పుడైనా యింక బుద్ధి తెచ్చుకుని, వీలై నప్పుడల్లా ఒకళ్ళకు ఉపకారం చేయటం నేర్చుకో. మిడిసిపడి ఎవళ్లమాటా నిర్లక్ష్యం చేయకు" అని అనేకవిధాల బోధచేసి గాలి వీచటం మానివేసింది. గాలి కదలకుండా వుండేసరికి మంట ఆరిపోయింది. మంట ఆరిపోయేసరికి నీళ్లు చళ్ళబడిపోయినయి.

ఇంతలో వంటలసాయిబు వచ్చి మళ్లీ డేగిశా కిందికి దింపి, నీళ్లు ఎంత వెచ్చబడి నయ్యో అని మూతతీసి చూడబోయాడు. మూత తీసేతియడంతోనే మేమే - మేకపిల్ల గభీమని డేగిశాలోనించి దూకి తుర్రుమని ఇంటికి పారిపోయింది. జరిగినదంతా తల్లితో చెప్పింది.

పాపకు గండం తప్పినందుకూ, గాలి దేవుడి బోధవల్ల పెంకితనం అణిగి, బుద్ధి వచ్చినందుకూ తల్లి చాలా సంతోషించింది.






# పాపిష్ఠి ముఖాలు

చాలకాలం క్రిందట శాంతినగరం అనే పట్టణాన్ని శాంతసింహుడు, అనేరాజు పరిపాలిస్తుండేవాడు. అతని భార్య శాంతిమతీదేవి అన్నివిధాలా రాజుకుతగ్గ రాణీని అనిపించుకున్నది. వారు తమ ప్రజలను ఎంతో దయతో చూచుకుంటూ, వాళ్ల కష్టసుఖాలు ఎప్పటి కప్పుడు తెలుసుకుంటూ, తమ పట్టణం పేరు, తమ పేరు సార్థకం చేసుకున్నారు. వీరికి ఒక్కగా నొక్కడే కొడుకు, ధీరవర్ముడు.

శాంతసింహుడు ఉన్నట్లుండి పాపం, అకస్మాత్తుగ మరణించాడు. తండ్రి మరణించేసరికి ధీరవర్ముడికి నిండా ఆరేండ్లయినానిండలేదు. అందుచేత అతని మేనమామ అయిన దుష్టపాలుడే రాజ్యం చెయ్యసాగాడు. క్రమంగా అతనికి రాజ్యం మీద కాంక్ష పుట్టింది. ఎప్పటికైనా తన మేనల్లుడు పెద్దవాడై మళ్లీ రాజ్యం తిరిగి తీసుకుంటాడు గనక ఎలాగైనా మేనల్లుణ్ణి రాజ్యం నించి వెళ్ళగొట్టాలని దుష్టపాలుడికి దుర్బుద్ధి పుట్టింది. ఈ దుర్బుద్ధి మనసులో వుంచుకుని, పైకి ఎంతో ప్రేమగలవాడిలా నటిస్తూ రాజ్యం ఏలసాగాడు.

పదునాలుగేండ్లు గడిచినై. ధీరవర్ముడికి యిప్పుడు ఇరవైయ్యో ఏడు. అన్నిరకాల విద్యల్లోనూ ఆరితేరాడు. అప్పుడు శాంతిమతి తన అన్న అయిన దుష్టపాలుడితో,

"అన్నయ్యా, ఇంతకాలం నువ్వు శ్రమ తీసుకొని రాజ్యం జాగ్రత్తగా చూశావు. ఇప్పుడు నీ మేనల్లుడు పెద్దవాడైనాడు కదా. ఇక వాడి రాజ్యం వాడికి వప్పగించి నీవు పైయెత్తున వుండి చూడరాదా!" అన్నది.

"అలాగే నమ్మా! నేను మాత్రం కాదన్నానా? కాని నేను రాజ్యం వాడికి ఒప్పగించే ముందు వాడు ఒక ముఖ్యమైన పనిచెయ్యాలి. అది చేస్తేగాని మన రాజ్యం

ఒక గ్రీకు కథకు అనుకరణ



మనకు నిలవదు. అది నెరవేర్చటానికి ధీరవర్మ్మడి కంటే ధైర్యశాలిగాని, తెలివి గలవాడుగాని నా కు కనిపించటంలేదు. ఆ ఒక్కపని చేసివచ్చినతర్వాత రాజ్యంతో పాటు నా కూతురినే యిచ్చి పెళ్లిచేసి బ్రహ్మాండంగా పట్టాభిషేకం చేద్దామని అనుకున్నాను" అన్నాడు దుష్టపాలుడు, ఎంతో నమ్మకం కలిగేటట్టు. రాణి సరే నంది.

ఇకనేం, మర్నాడే దుష్టపాలుడు తన మంత్రివర్గాన్ని చేర దీసుకుని ఆలోచనలు మొదలుపెట్టాడు. ఆ మంత్రులు కూడా రాజుకంటె మరింత దుష్టులు కావటాన అట్టే శ్రమ లేకుండా నే ఒక పాపిష్టి ఉపాయం తట్టింది.

"ఇక్కడికి తూర్పుగా ఆ రామడ దూరాన ఒక భయంకరమైన రాక్షసుడు ఉన్నాడట. ఆ రాక్షసుడు ఎట్లా వుంటాడో, ఎక్కడ వుంటాడో ఎవరికీ తెలియదు. కాని ఇప్పటికి ఎంతోమంది యోధానుయోధులు వాడిని చంపాలని ప్రయత్నించినట్లూ, కాని ఎవరివల్లా సాధ్యంకానట్లూ తెలుస్తోంది. అంతేకాదు. అలా వెళ్లినవాళ్ళలో ఏ ఒక్కడూకూడా తిరిగిరానట్లు తెలుస్తోంది. కనక, మన ధీరవర్మ్మడిని ఆ రాక్షసుడిని చంపిరమ్మని పంపండి. ఇదివరకు వెళ్లిన వాళ్లలాగా యితనూ తిరిగి రాలేడు. అంతటితో మీరు నిశ్చింతగా రాజ్యం ఏలుకోవచ్చు." అని ఉపాయం చెప్పారు.

రాజుకి ఈ ఉపాయం బాగా నచ్చింది. వెంటనే ధీరవర్మ్మణ్ణిపిలిచి యిలాచెప్పాడు:

"ఇంతకాలం నించీ నువ్వు చిన్నవాడివిగా వుండటాన రాజ్యం నేను చూస్తున్నాను. ఇప్పుడు నువ్వు అన్నివిద్యలూ బాగా నేర్చి పెద్దవాడవయ్యావుకనక యిక రాజ్యం నీకు వదులుదామని నిశ్చయించు

కున్నాను. కాని, దీనికి ముందుగా మనం ఒక పని చెయ్యాలి. అది నీవు తప్ప మరెవ్వరూ చెయ్యలేరని నా నమ్మకం. అపనిని నీవునెరవేర్చి తిరిగివచ్చిన తర్వాత నా కూతురిని నీ కిచ్చి పెళ్లిచేసి మంచి ముహూర్తాన పట్టాభిషేకం చేద్దామని నిశ్చయించుకున్నాను.

"ఇక్కడికి తూర్పుగా ఆ రామడ దూరంలో ఒక సముద్రపుటొడ్డున ఒక మాయరాక్షసుడు వున్నాడట. వాడుప్రతి ఏడూ ఏదో ఒక రాజ్యం మీద పడి ఆ రాజ్యంలో ప్రజలని అందరినీ, ఒక్కరినైనా మిగల్చకుండా చంపి వేస్తాడట. ఇప్పటికి మన శత్రురాజ్యాలేమిటి, మిత్ర రాజ్యాలేమిటి ఎన్నో వాడిచేతిలో నాశనమై పోయినవట. ఈ సారి వాడు మన రాజ్యం మీద కన్నువేసివున్నట్లు నాకు జ్యోతిష్కులు చెప్పారు. కనుక మనరాజ్యం రక్షించుకోవాలంటే వాడిని హతమార్చడం ముఖ్యమైనపని. కనుక, రేపే నువ్వు బయలుదేరి వెళ్లి, ఆ రాక్షసుణ్ణి చంపి వాడితల తీసుకు రావాలి. ఈ పనిని నువ్వు జయప్రదంగా చేసుకువస్తే మనం నిశ్చింతగా రాజ్యం ఏలుకోవచ్చు. మనగుఱ్ఱాలలో మంచిదానిని



ఒకటి చూసి తీసుకుపో. నీకు ఒకడాలూ, ఒక కత్తీ ఇస్తున్నాను. వాటి సహాయంతో నీవు ఆ రాక్షసుణ్ణి సంహరించి క్షేమంగా తిరిగిరా" అని చెయ్యెత్తి దీవించాడు.

అంతా విని రాజకుమారుడు, "అలాగే మామా. రేపే బయలుదేరి పోతాను. ఒక సంవత్సరంలోగా తిరిగి మీఎదుటికివస్తాను. అలా రాకపోతే నా కేదో అపాయం కలిగి వుంటుందని అనుకోండి." అని చెప్పి కత్తీ, డాలూ తీసుకుని గుఱ్ఱంమీద బయలుదేరాడు.

* * *



ధీరవర్మ డు అలా బయలుదేరి వాయు వేగంతో గుఱ్ఱంమీద పోసాగాడు. దారిలో యెన్నో కొండలూ, లోయలూ, గుట్టలూ, మిట్టలూ, వాగులూ, నదులూ, ఒకటేమిటి ఆఖరికి కాకులుదూరని కారడవులూ, చీమలుదూరని చిట్టడవులూ కూడా దాట వలసి వచ్చింది. అన్నికష్టాలకూ ఓర్చి, ఇన్నిటినీ దాటుతుంటూ ధీరవర్మ డు అలా పోతూనే వున్నాడుగాని ఎక్కడా రాక్షసుడి జాడ కనిపించలేదు. మరికొంత సేపటికి ధీరవర్మ డు ఒక పెద్దఎడారిలోకి వచ్చాడు. కనుచూపుమేర దూరంలో యెక్కడా మనుష్య సంచారం కనిపించకపోయేసరికి దారితప్పి పోయానేమోనని ధీరవర్మ డికి భయంవేసింది. గుఱ్ఱం దిగి, ఆ యెడారి మధ్యంలో ఒకచోటకూర్చుని ఏమి చెయ్యా టమా అని ఆలోచించసాగాడు. ఇంతలో ఎవరో వెనకనుంచి వీపుమీద తట్టిన ట్లని పించింది. ఎవడైనా రాక్షసుడేమోనని ధీరవర్మ డు ఉలిక్కిపడి ఒక్కసారిగా లేచికూర్చుని కత్తి దూయ బోయాడు.

కాని తీరాచూస్తే అతనొక వృద్ధుడు. "ఎవరబ్బాయీ, నువ్వు? ఇటెక్కడికి వెడుతున్నావ్? ఈ దారి అసలే ప్రమాద మైనది. అందులో నువ్వు ఒంటరిగా పోతున్నావు. బహుశా నీకు తెలియక ఇటు వచ్చివుండవచ్చు. ఇప్పటికైనా నా మాటవిని వెనక్కు తిరుగు. లేకపోతే చాలా ప్రమా దాలు కలుగుతై నీకు" అన్నాడా వృద్ధుడు.

అప్పుడు ధీరవర్మ డు ఆ వృద్ధుడితో తన మేనమామ తనకు ఒప్పగించిన పని సంగతి చెప్పి, ఆ పనిని నెరవేర్చటానికే తను బయలుదేరివెడుతున్నానని చెప్పాడు.

"ఓయి పిచ్చినాయనా! ఆ రాక్షసుణ్ణి చంపటం నీబోటి కుర్రవానివలన అయ్యే పనా? మహామహా యోధులే సగందూరం

వృథాగా వెళ్ళి వెనక్కి తిరిగి వచ్చేశారు. ఎందుకు వృథాగా ప్రాణాలు పోగొట్టు కొంటావ్? నామాట విని ఇప్పటికైనా తిరిగి ఇంటికిపో." అన్నాడు వృద్ధుడు.

"అదేమీ కుదరదు. ఈ పని చేసిగాని తిరిగి రానని నేను నా మేనమామ దగ్గర వాగ్దానం చేసివచ్చాను. వాగ్దానం చెయ్యనే కూడదు గాని, తీరా చేశాక అది నెరవేర్చ కుండా తిరిగి వెళ్లటం మా వంశంలోనే లేదు. దీంట్లో నా ప్రాణం పోయినా సరే నేను ఈ ప్రయత్నంనించి మానుకుని యింటికివెళ్ళలేను" అని బదులు చెప్పాడు ధీరవర్ముడు.

ఇంకా నిండా పాతికేళ్లయినా నిండని ఆ రాకుమారుని ధైర్యపుమాటలు వినేసరికి వృద్ధుడికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. చాల ప్రమాదమైనపనికి యింతధైర్యశాలి అయిన మేనల్లుణ్ణి ఎలా పంపగలిగాడా అని దుష్టపాలుడి యెడల ఎంతో ఆగ్రహం కలిగింది. "పాపం, ఏమీ ఎరుగని యితనిని కష్టాలపాలు చెయ్యాలనే దుర్బుద్ధితోనే అత నిలాచేసివుంటాడు. ఇందుకు తగ్గ ఉపాయ మేదైనా ఆలోచించి దుష్టపాలుడికి మంచి పాఠం నేర్పాలి" అనుకున్నాడు వృద్ధుడు.



"అబ్బాయి! నీవు చెయ్యదలచుకొన్న పనిలో నీకు విజయంకలిగేటట్లు చూస్తాను. సరే, మరి నీవెంట ఏమేమి ఆయుధాలు తెచ్చావ్?" అని అడిగాడు వృద్ధుడు.

"ఇదుగో ఈ డాలూ, కత్తీ తెచ్చాను" అని ధీరవర్ముడు అవి రెండూ చూపించాడు. అవిచూసి వృద్ధుడు పకపకానవ్వి, "భలే ఆయుధాలు. పైగా ఇవి చూడబోతే మీ తాతలనాటివిలావున్నై. వీటితోనా నువ్వు రాక్షసుడిని చంపటానికి బయలుదేరావ్" అన్నాడు. ధీరవర్ముడు యిది విని చిన్నబోయాడు. ఇది చూచి వృద్ధుడు, "సరేలే




యిప్పుడు దీన్నిగురించి విచారించటం ఎందుకు? సరే, ప్రస్తుతం మనం బయలుదేరేముందు నువ్వు నీ డాలుని తళతళ మెరిసేలాగున తోము. నీ ముఖం నీకు అద్దంలో కనిపించినట్లు నీ డాలులో కనిపించేటంతగా మెరుస్తుండాలి. ముందు యిది చెయ్యి" అన్నాడు.

ధీరవర్ముడు అలాగే తన డాలుని తళతళ మెరిసేలా తోమాడు. వృద్ధుడుకూడా ధీరవర్ముడి నేర్పుచూసి చాల మెచ్చుకున్నాడు. "భేష్! అలా వుండాలి." అని అతని భుజంమీద తట్టాడు.



ఇదంతా అయినతర్వాత వృద్ధుడు ముందు, అతని వెనుకనే గుఱ్ఱంమీద ధీరవర్ముడూ బయలుదేరి పోసాగారు. నడుస్తూ నడుస్తూ వృద్ధుడు ఒక్కసారిగా మాయమయ్యాడు. ధీరవర్ముడికి చాల భయం వేసింది. చుట్టూచూశాడు–ఎక్కడావృద్ధుడి జాడ కనిపించలేదు. అలా చూస్తూవుండగా, వృద్ధుడు వంద గజాల దూరంలో గాలిలో తేలిపోతూ వున్నాడు. "ఇదేమివింత! ఇప్పటిదాకా నాతోపాటు నడుస్తున్నవాడు యిలా పక్షిలా ఎలా గాలిలో తేలిపోగలిగాడు?" అనుకుంటూ ధీరవర్ముడు వృద్ధుడి వంక పరీక్షగా చూడసాగాడు. అప్పుడు వృద్ధుడి కాళ్ల చెప్పులకు రెక్కలు వుండటం ధీరవర్ముడికి కనిపించింది. "ఓహో, ఇదా సంగతి!" అని మనస్సులో అనుకుని ధీరవర్ముడు తనగుఱ్ఱాన్ని మరింతవేగంగా తోలసాగాడు. కాని, వృద్ధుణ్ణి కలుసుకోవటం మాత్రం ధీరవర్ముడికి సాధ్యంకాలేదు.

ముందు గాలిలోపోతున్న వృద్ధుడు ఒకసారి వెనక్కుతిరిగి "ఏమోయ్, మనమడా, గుఱ్ఱమీంద వస్తున్నా కూడా నువు, పాపం, చాలా వెనకపడ్డావేం? ఇంతేనా నీ బలం!" అని వెక్కిరించినట్టుగా అడిగాడు. తను

కాళ్లకు రెక్కల చెప్పులు తొడుక్కున్న సంగతి, ధీరవర్మడు కనిపెట్టలేదనే నమ్మకంతోనే వృద్ధుడు యిలా అన్నాడు.

"మీరు తొడుక్కున్నలాంటి రెక్కల చెప్పులు నాకూ వుంటే గుఱ్ఱాన్ని వదిలేసి నేనూ వస్తాను. అప్పుడు తెలుస్తుంది ఎవరు వెనకపడేదీ ?" అన్నాడు ధీరవర్మడు.

"ఓహెూ, కనిపెట్టావన్నమాట! ఎలాగైనా తెలివిగల బుఱ్రనీది. సరే, యిప్పుడు నీకు మరో జత చెప్పులు తేవటం కుదరదు. యిదుగో, ఈ కఱ్ఱ చేతితో పట్టుకో. ఇక నువ్వూ నాతోపాటే గాలిలో తేలిపోతూ రాగలుగుతావు"అని చెప్పి తనచేతిలో వున్న కఱ్ఱని ధీరవర్మడివైపు విసిరివేశాడు.

ధీరవర్మడు అది చేతపుచ్చుకోగానే తనూ గాలిలో తేలిపోసాగాడు.

దారిలో ధీరవర్మడు అడిగాడు— "ఆరాక్షసుణ్ణి గురించి చెబుతానన్నారుగదా ఇప్పుడు చెప్పండి" అని.

అప్పుడు వృద్ధుడు యిలా చెప్పసాగాడు:

"ఆ రాక్షసుడు సామాన్యమైనవాడు కాడు. వాడి ఒళ్లు గట్టి లోహంతో చేయబడి వుంటుంది. పలుగులతోనైనా బ్రద్దలు చెయ్యటానికి సాధ్యంకాదు. పెద్దపెద్ద



కోరలతో చూడటానికి చాల భయంకరంగా వుంటాడు. వాడికి మూడు తలలు వుంటై. తలమీద వెంట్రుకలకు బదులు లెక్కలేనన్ని పాములు బుసలుగొడుతూ వుంటై. వాడికి బంగారులా మెరిసే రెక్కలుకూడా వుంటై. వాటి సహాయంతో వాడు ఆకాశంలో ఎగరగలడు కూడా. అన్నిటికన్నా ఆశ్చర్యకరమైన సంగతి ఒకటి వుంది. ఎవరైతే వాడివంక చూస్తారో వాళ్ళు అపళంగా నిలువున రాయిగా మారిపోతారు. కనుక నువ్వు ఆ రాక్షసుణ్ణి చంపాలంటే వాడి దగ్గిరికి చేరడమే ఎంతో కష్టం. ఒకవేళ ఎలాగైనా అక్కడికి చేరుకున్నావే అనుకో. వాడివంక నువ్వు చూడకుండా, కళ్ళు మూసుకుని వాడిని చంపాలి. మరి, యిప్పుడైనా చెప్పు ఈ పని మానుకునిపోతావో, కాదు కూడదు చేసి తీరతానంటావో."

"అలాంటి పిరికిపందని కానని మొదటే చెప్పాను. వెనక్కు తిరిగిపోవట మనేది కలలో వార్త. నా ప్రాణంపోయినా సరే ఈ ప్రయత్నంమానను" అన్నాడు ధీరవర్ముడు.

"సరే యిప్పుడు మనం ముగ్గురు గుడ్డివాళ్ళదగ్గిరికి పోవాలి. ఈ పని జయప్రదంగా ఎలా చెయ్యాలో చెప్పగలిగింది ఆ గుడ్డివాళ్ళే." అన్నాడు వృద్ధుడు.

"ఎవరా ముగ్గురు గుడ్డివాళ్ళు? వాళ్ళు ఎక్కడ వుంటారు?" అని ఆత్రంగా అడిగాడు ధీరవర్ముడు.

[ఆ గుడ్డివాళ్లెవరో, వృద్ధుడేమి చెప్పాడో, ఆ తర్వాత ఏమి జరిగిందో వచ్చేనెల చందమామలో చదవండి.]






పూర్వకాలంలో పెరుమాళ్లు అనే భక్తుడు ఉండేవాడు. అతను ఊరూరా తిరిగి, దేవుడి మహిమలను గురించి కథలు చెబుతూ వుండటం, ప్రజలకు వేదాంతం బోధిస్తూ వుండటం పనిగా పెట్టుకున్నాడు. అతను గొప్పభక్తుడని అందరూ నమ్మేటందుకు తగినట్టుగా పెరుమాళ్లు గెడ్డం పెంచి, కావిగుడ్డలు కట్టుకునేవాడు. రుద్రాక్షమాలలూ అవీ వేసుకొనేవాడు. అతను ఊరూరా తిరిగి ఉపన్యసించేవాడు.

"అన్నలారా, అక్కలారా, తల్లులారా!- తండ్రులారా! ఎల్లప్పుడూ సత్యమే పలకండి. ఎవళ్ళనూ మోసంచేయకండి. పుణ్యకార్యాలు చేసి తరించండి. నీ సొమ్ము నా సొమ్ము అనే భేదబుద్ధి పెట్టుకోకండి. కర్మ, అనగా పని చేయటమే మనవంతు, ఫలం పెరుమాళ్లకే వదిలివేయండి. దానధర్మాలు విరివిగా చేయండి. ఇదే మానవులకు ముక్తిమార్గం......" అని యీ విధంగా పెరుమాళ్లుస్వామి ఉపన్యాసం ఇస్తూవుంటే, విన్నవాళ్లకు వళ్లు జలదరించేది. 'ఇక ఈ లోకమెందుకు, ఈ సంసారమెందుకు?' అని వాళ్లకు వైరాగ్యం కలిగేది. అందుచేత అనేకమంది వెంటనే ఆయనకు శిష్యులైపోయేవారు.

శిష్యులు ఎక్కువగా చేరి, వాళ్లకు తన మీద బాగా భక్తి కుదిరిన తరువాత అతను పూజలకూ, అభిషేకాలకూ, అరాధనలకూ డబ్బు తెమ్మనేవాడు. ఇలా వసూలయిన ధనంతో పిట్టకయినా తెలియకుండా ఒక బరువయిన బంగారు విగ్రహం చేయించి దాచుకొన్నాడు.

కొడుకుల నారాయణ - నర్సీపట్నం



పెరుమాళ్లు వేసే పై వేషం చూచి, శిష్యులంతా 'స్వామివారు నిజంగా మహానుభావుడు, ఈ ప్రపంచంలో ఆయనకు ఏమి కావాలె? ఇటువంటి సద్గురువు దొరకటం మన పూర్వపుణ్య విశేషం' అని వాళ్ళలో వాళ్లు అనందించేవారు.

త్వరలోనే స్వామివారి కీర్తి ఈ గ్రామాలకు కుడా పాకిపోయింది. ఎక్కడపడితే అక్కడనే యెంతోమంది ధనవంతులు ఆయన శిష్యులుగా చేరి ముక్తిమార్గంకోసం ఆశ్రయించేవారు. అందరూ, 'మా ఇంటికి రండి' అంటే 'మా యింటికి రండి' అని పోటీలుపడి గురువుగారిని భిక్షకు పిలిచేవారు. ఎవళ్లమటుకి వాళ్లకే ముందుగా మోక్షమార్గం తెలుసుకోవాలని కోరిక. ఆ పోటీలో ఏ ఒక్క శిష్యుణ్నీ కాదనటానికి స్వామిమనస్సొప్పేదికాదు. ఐతే, అందరి ఇళ్ళకూ వెళ్లి శిష్యులందరినీ సంతోషపెట్టడానికీ ఆయనకు కాలం చాలేదికాదు.

అయినా, పెరుమాళ్లస్వామి ఎన్నో గ్రామాలు తిరిగారు. ఎంతోమంది శిష్యుల దగ్గర శంతులప్రకారం భిక్షలు ఆరగించారు. వాళ్లను సంతోషపెట్టి, ముక్తిమార్గం చూపించారు.

చివరకు ఒకనాడు, స్వామికి భిక్ష చేయటం ఒకపేదశిష్యుని వంతు వచ్చింది. స్వామివారు వస్తాననటమే చాలు, గిన్నె ముంతా తాకట్టు పెట్టయినా సరే భిక్ష చేయాలిసిందేకాని, 'నావల్ల కాదు' అనటం సిగ్గుచేటు, పైగా పాపం చుట్టుకుంటుంది అని ఆ శిష్యుడూ, అతని భార్యా నిశ్చయించుకొన్నారు.

అనుకున్నట్టుగా భిక్షజరిగింది. "శిష్యా! అనేకచోట్ల భిక్ష జరిగింది. కాని, నీ మోస్తరుగా ఎవళ్ళూ చేయలేకపోయారు. కాని, నీవు పేదవాడివని విన్నామే? ఇంతచక్కగా ఎలా చేశావో? " అన్నారు స్వామి.

దానికి బదులుగా "స్వామీ! అంతా పెరుమాళ్ళకెరుక !!" అని మాత్రం శిష్యుడు జవాబు చెప్పి వూరుకొన్నాడు.

'సరి, మనంబోధించిన వేదాంతం వీడికి బాగా తలకెక్కింది' అని స్వామి మనస్సులో సంతోషించాడు. "శిష్యా! నీ గురుభక్తికి మా ఆత్మ చాలా ఆనందించింది. మరి నాలుగురోజులు యిక్కడనే వుండి, నిన్ను తరింపజేసి మరీ వెళతాము " అని స్వామి సెలవిచ్చారు.

'ఈ పేదవాడిమీద నేమిటి, స్వామికి యింత అభిమానం కుదరట మేమిటి? ఇందులో ఏదో విశేషం ఉండితీరాలి' అని ధనవంతులైన తక్కిన శిష్యులు అందరూ ఆశ్చర్యపోయారు.

అయితే, స్వామియిచ్చిన ఆజ్ఞకు ఈ పేద శిష్యుడికి మాత్రం గుండెలో రాయి



పడింది. మొదటిరోజు భిక్షకే, ముంతా మూకుడూ తాకట్టుపెట్టవలసి వచ్చె. ఇంకా నాలుగురోజు లుంటానంటున్నాడు స్వామి. ఏం చేయాలి ?—

పేదశిష్యుడు ధైర్యంతో స్వామి ఆజ్ఞను శిరసావహించాడు. ఉపన్యాసంలో చెప్పిన స్వామివారి బోధలన్నీ ఈ శిష్యునికి బాగా జ్ఞాపకమున్నాయి."నీదీ నాదీ అనే భేదబుద్ధి పనికిరాదు. కర్మ, అనగా పనిచేయటమే మనవంతు. ఫలం పెరుమాళ్లకే వదిలేయండి..." అని చెప్పిన మాటలు మనస్సులో గుర్తువుంచుకున్నాడు.

పేదశిష్యుని యింట్లో పెరుమాళ్లుస్వామికి నాలుగురోజులూ చాలా గొప్పగా భిక్ష జరిగింది. స్వామి శిష్యునిభక్తికి మెచ్చుకొని, ఎక్కువగా దీవించాడు. అయితే, స్వామికి ఏదో సందేహం కలిగినట్టు కనపడేవాడు. ప్రతిరోజునా శిష్యుణ్ని దగ్గిరికి పిలిచి, "శిష్యా, నీవు పేదవాడివని విన్నామే? ఇంత వైభవంగా ఎలా భిక్షచేయగలుగుతున్నావు?" అని ఆశ్చర్యంతో అడిగేవాడు. అలా అడిగినప్పుడల్లా శిష్యుడు "స్వామీ, అంతా పెరుమాళ్లు కెరుక!" అని మాత్రం సమాధానం చెప్పి వూరుకొనేవాడు.

అయిదు రోజులూ అయిన తరవాత స్వామివారు మరొకగ్రామానికి మకాం మారుద్దామని ఏర్పాటు చేసుకొన్నారు. వెళ్లేముందు పేదవాడైన ప్రియశిష్యుణ్ని బాగా దీవించి, ముక్తిమార్గానికి కావలసిన మర్మాలు అన్నీ చెప్పారు. శిష్యుడు మళ్లీ ఒక్కసారి "స్వామీ, అంతా పెరుమాళ్ళ కెరుక!" అని చెప్పి గురువుగారివద్ద సెలవు తీసుకొన్నాడు.

స్వామివారు కొత్త మకాం చేరుకునే లోపల రహస్యంగా ఒకసారి విగ్రహంతీసి చూచుకొన్నాడు. చూచేసరికి ఏమున్నది!- అరవీసె బంగారపు విగ్రహమూ అయిదు తులాల బరువయినా లేదు, లోపలంతా గుల్లయిపోయి వుంది!!

పెరుమాళ్ళ పేదశిష్యుణ్ని మనస్సులో తలుచుకొని "శిష్యా! లక్షలాది జనానికి వేదాంతంబోధించాను. కాని నేను తరించే మార్గం కనుక్కోలేకపోయాను. ఈ నాటికి నువ్వు బయలుదేరి నా కళ్ళకు పట్టిన మాయపొర తుడిచివేశావోయ్!" అని అంటూ, కుప్పగా కూలబడిపోయాడు.






# తాత మూకుడు

ఒక పూళ్లో వెంకయ్య అనే కాపు ఉండే వాడు. అతను చాలా కష్టజీవి. కనుకనే, తనకు తండ్రి విడిచిపోయిన ఆరు ఎక రాల పొలాన్ని కొద్దికాలంలోనే అరవై ఎక రాలు చేయగలిగాడు. అంతేకాదు. తను నివసించటానికి అన్ని సదుపాయాలూ కల ఒక మేడకూడా కట్టించుకున్నాడు.

అన్నీ బాగానే వున్నయిగాని, అతనికి ఒక్కటే లోటు!— సంతానం లేకపోవటం. "తిండిగుడ్డలకు లోపంలేకుండా భగవం తుడు ఏదోఇంత కలుగజేశాడు. తల దాచుకునేందుకు వసతికూడా వున్నది. కాని ఏం లాభం! అనుభవించటానికి ఒక్క నలుసయినా లేకపోయె" అని చెప్పి అతను వాపోతూ ఉండేవాడు.

కొంతకాలానికి సింహాచలం దేముడి దయవల్ల ఒక కుమారుడు కలిగాడు. సింహాద్రి దయవల్ల పుట్టినపిల్లవాడు కాబట్టి వానికి నరిసిమ్మ అని పేరుపెట్టారు.

నరసిమ్మకు పుట్టుకతోనే లోభగుణం పట్టింది. అతను చూడగా ఒకళ్లకు పెట్ట నిచ్చేవాడు కాదు. తలిదండ్రులు ఎవళ్ల కయినా దానం ధర్మం చేసుకోబోతే పెద్ద గోల చేసేవాడు. 'ఆఁ- చిన్నప్పటి గుణాలు పెద్దయిన తరువాత ఉంటయ్యా, బుద్ధి మారకపోతుందా!' అని వెంకయ్యా భార్యా అనుకునేవాళ్లు. కాని, నరసిమ్మ పెద్దవా డయినా, ఈ దుర్గుణం మారలేదు.

'ఇక ఇది పనికాదు. అబ్బాయికి పెళ్లి చేస్తే, కొడలే వాడికి ధర్మగుణం నేర్పు తుంది; ఇంటికోడలువల్లనేకదా కుటుంబ గౌరవం నిలబడేది' అని ముసలివాళ్లు ఆశించి, ఒక చక్కటిచుక్కను చూసి నరసిమ్మకు ముడిపెట్టారు.

అయితే—ఇదివరకల్లా ఇతరులవిషయం లోనే కొడుకు లోభగుణం కనపడేది కాని, కోడలు వచ్చాక పాపం, ముసలివాళ్ళ బతుకుకే మోసం వచ్చింది.

గాదె మాణిక్యం - మారుటేరు



ముసలికాలములో ఆసరా అవుతాడని వెంకయ్య దంపతులు కుమారుడిపైన కొండంత ఆశపెట్టుకొని వున్నారు. కానైతే, వారు తలచింది ఒకటీ, ఇప్పుడు జరుగుతున్నది వేరొకటీ. ఈ దురవస్థకు వారు విచారపడ్డారు. 'కానిలే, ఎప్పటికయినా వీడికి కొడుకు పుట్టకపోతాడా, బుద్ధిచెప్పక పోతాడా' అని ముసిలి దంపతులు వాళ్లలో వాళ్లు అనుకొని తృప్తిపడేవారు.

వాళ్ళ నోటివాక్యం ఫలించి, మరి కొద్ది కాలానికే నరిసిమ్మకు ఒక కుమారుడు పుట్టాడు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందని పెద్దలు అంటారు. నరిసిమ్మకు కుమారుడు కలగగానే, పిల్లవాడు తాతను పోలినాడనీ, ధర్మబుద్ధికలవాడనీ అందరూ అనుకున్నారు. గుణాలనుబట్టి పిల్లవానిని ధర్మన్న అని పిలుస్తూ వచ్చారు.

అయితే, లోకులు చెప్పుకోగా విని ఆనందించడమేగాని, ముద్దుల మనమడిని కంటారా చూడటానికీ, ముచ్చటతీరా ఎత్తుకోటానికీ వెంకయ్య దంపతులు నోచుకోలేదు! ఏమీ అంటే, తాత అవ్వల దగ్గరకు ధర్మన్నని పోనివ్వకుండా నరిసిమ్మ తగిన కట్టుదిట్టంచేశాడు.

ఎక్కువ కర్చు కాకుండా వుండాలనే వుద్దేశంతో నరసిమ్మ ఎటువంటి దుర్మార్గపు పని చేశాడో తెలుసా?— తల్లినీ తండ్రినీ పశువుల పాకలో ఉండమన్నాడు. ఆ రొచ్చులోనే ఇద్దరకూ చెరి వక కుక్కిమంచమూ వేయించాడు. పక్కకూ, కప్పుకోటానికీ రెండేసి చింకి బొంతలు ఇచ్చాడు. ఇవన్నీ అటుంచి,వారికి మూకుడు ఒకటి కొనియిచ్చాడు. భోజనాల వేళ నరిసిమ్మ వంటవాడిని వెంటబెట్టుకు వెళ్లి, వాళ్ళకు ఆ మూకుడులో చాలీ చాలని మెతుకులూ, ఇంతగంజీ పోయిస్తుండేవాడు.

అయినా, ధర్మన్నకు ఊహ రాగానే పశువులపాకలో జరిగేసంగతులన్నీ తెలుసుకొన్నాడు. తండ్రి తనను మేడమీదనే ఉండమని బలవంతపెట్టినా, పశువుల పాకలోనే ఉండి, తాతతోనూ అవ్వతోనూ చనవుగా మసిలేవాడు. ఎంతచేసినా నరిసిమ్మ కొడుకును మందలించలేక పోయాడు. ప్రతిరోజునా నరసిమ్మ దగ్గర వుండి ముసిలివాళ్ళకు మూకుడులో గంజి పోయించేటప్పుడు ధర్మన్నకూడా తండ్రి పక్కనే వుండి ఏదో ఆలోచిస్తూవుండేవాడు.

ఇలా వుండగా, ఒకనాడు భోజన సమయానికి వెంకయ్య తన మూకుడు తెచ్చుకొన్నాడు. నరిసిమ్మ గంజి పోయించాడు. కాని, పెద్ద వయస్సు కావటంచేతనో చాలిన తిండి లేక, నీరసం చేతనో, వెంకయ్య తిరిగి వెళ్లేటప్పుడు చేతిలో మూకుడు జారిపడి, పుటుక్కున బద్దలై పోయింది.

తండ్రిపక్కనేవున్న ధర్మన్న గభాలున తాతచెయ్యి పట్టుకొన్నాడు. "ఏమిటి తాతా, మూకుడు పగులగొట్టేశావే. ఇప్పుడెలా



గనుకున్నావు? మా బాబూ, అమ్మా ముసిలివాళ్ళయిన తరవాత మరి, వాళ్లకు నేనుకూడా ఇందులో గంజిపోయించవద్దా? అప్పుడు మళ్లీ ఇంకొక మూకుడు కొన మంటావా? తాత కిచ్చిన మూకుడు తర తరాలా ఉండాలి గాని, యిలా పగలకొట్టు కుంటారా ఎవళ్ళయినా? బాగా చేశావులే!!" అని కోపగించినట్టు కసిరాడు.

చిన్నవాడయినా, ధర్మన్న చెప్పిన మాటలవల్ల నరిసిమ్మ తన పొరబాటును వెంటనే గ్రహించాడు. ఇంతవరకు తలి దండ్రులపట్ల క్రూరంగా ప్రవర్తించినం దుకు సిగ్గుపడ్డాడు. ఉత్తపుణ్యానికి ముసిలి వాళ్ళను కష్టపెట్టినందుకు ఫలితంగా రేపు తనకూ ఇదే గతికదా అని తెలుసుకుని భయపడ్డాడు కూడాను.

ఐమే తలిదండ్రుల పాదాలమీద పడి, కంటికి కుంచెడు నీళ్లుగా యేడిచి, క్షమాపణ వేడుకొన్నాడు. ఈ మారుని కి పశ్చాత్తాపం కలిగి, యిటువంటి మార్పు వచ్చినందుకు వెంకయ్య దంపతులు ఎంతో సంతోషించారు. తండ్రి బుద్ధిని మళ్లించిన చిన్నారి ధర్మన్నను ఎత్తుకొని తాత, అవ్వలు ముద్దులాడారు. ఈ సంతో షంలో వాళ్లు మధ్యవచ్చిన కష్టాలను మరిచేపోయారు.

వెంకయ్య దంపతులను కొడుకూ, మనమడూ అమట్టునే మేడలోకి తీసుకు పోయారు. పెద్దవాళ్ళకే పెత్తనం ఒప్ప గించారు. అప్పటినుంచీ ఆ కుటుంబం అందరూ హాయిగా వుంటున్నారు.

అయితే, చిన్నవాడయినప్పటికీ "తాత మూకుడు తరతరాలా ఉండవద్దా?" అని ధర్మన్న చెప్పినమాట ఆనోటా ఆ నోటా దేశమంతటా అల్లుకొని, మనకు సామెతగా నిలిచిపోయింది.






చాలకాలానికి పూర్వం మన రాష్ట్రానికి ఉత్తరంగా ఒక అడవి వుండేది. ఆ అడవిలో ఒక సవరవాడు చిన్నగుడిసె వేసుకొని కాపరం వుండేవాడు.

అతనికి యిద్దరు భార్యలు. అందులో పెద్దభార్య ఉత్తమురాలు, చిన్న భార్య గయ్యాళిగంప. ఈమెకు కోపము,ద్వేషము అసూయ మొదలయిన దుర్గుణాలన్నీ వున్నాయి. పెద్దామె పరమ సాత్వికురాలు. సవతి ఎన్నివిధాల తిప్పలు పెట్టినా వూరుకొనేది కాని, పల్లెత్తుమాట ఆడి యెరగదు.

రోజు రోజుకీ చిన్నభార్య అగడం మరీ ఎక్కువైపోతున్నది. పెద్దామె లొంగిన కొద్దీ మరింత లోకువకట్టి, చిన్న భార్య అస్తమానం భర్తతో చాడీలు చెప్పటం, పేచీలు పెట్టడం ప్రారంభించింది.

సవరవాడి భార్యలిద్దరకూ ఒక్క క్షణమైనా పడటంలేదు. వాళ్లు ఎప్పుడూ దెబ్బలాడుకోవటం చూసి, అతను ఇక ఈ బాధ పడలే ననుకున్నాడు. తను కాపరమున్న గుడిసెను రెండు భాగాలుగా చేసి, తూర్పు భాగం పెద్దభార్యకూ, పడమటిభాగం చిన్న భార్యకూ పంచి యిచ్చాడు. ఒక్కొక్క రోజున ఒక్కొక్క భార్యయింట్లో వుండటానికి నిర్ణయం చేసుకున్నాడు.

వాళ్ల పెరట్లో ఒకమారేడుచెట్టూ, పారిజాతం చెట్టూ కలిసి పుట్టి, పెద్దమానులయ్యాయి. ఆ యిల్లు రెండు భాగాలైనప్పుడు ఆ చెట్లు, సరీగా గోడమందడికి వచ్చాయి. ఇద్దరు భార్యలూ ఎవరి భాగం వేపునవున్న కొమ్మల పువ్వులు వాళ్లు కోసుకుని, తలలో పెట్టుకునే వాళ్లు.

యనమండ్ర రామమూర్తి - డెంకనికోట



సరే ఈపద్ధతి బాగా వుంది, ఇక భార్య లిద్దరూ ఒకళ్ళతో ఒకళ్ళు పోట్లాడుకోకుండా వుంటారు. ఇకముందు పేచీలేమీ ఉండవు. మనస్సుకి కాస్త శాంతి వుంటుందికదా అని నవరవాడు ఆశపడ్డాడు.

కానయితే, చిన్నభార్య చుప్పనాతితనం ఎప్పటిలాగనే వుంది. ఆమెకు పెద్దామె పైన వుండే అసూయ ఎంతమాత్రమూ తగ్గలేదు. సమయం దొరికినప్పుడల్లా పెద్దామెపైన కసి తీర్చుకుందామనీ, ఆమెను కష్టపెడదామనే చిన్నభార్య ఎదురుచూస్తూ వుండేది.

పెద్దామె దైవభక్తి కలది. మారేడు చెట్టులో ఈశ్వరుని హంశ వుండనీ, పారిజాతంపువ్వులు విష్ణుమూర్తికి ప్రీతికరమనీ పెద్దలవల్ల ఆమె చిన్నప్పుడే తెలుసుకొన్నది. దేవునిమహిమ తెలిసిన భక్తురాలు గనక పెద్దభార్య, పెరట్లోవుండే మారేడుతో కలిసిన పారిజాతపు చెట్టును దేవునిగా భావించింది. ప్రతి రోజునా ఆ చెట్టుకింద అలికి ముగ్గుపెట్టి భక్తితో పూజించేది.

చిన్నభార్యకు పతిభక్తీ లేదు, దైవభక్తి అంతకంటే లేదు. అసలు దేవుడంటేనే ఆమెకు నమ్మకంలేదు. పైగా సోమరిపోతు. అందుచేత, ఇల్లు తుడిచిన ధూళీ, దొడ్డి తుడిచిన చెత్తా అంతాపోగుచేసుకువచ్చి తన వేపున వుండే ఆ చెట్టుకింద పారబోస్తూ వుండేది.

అదేమి మాయోగాని, ప్రతిరోజూ తెల్లవారేసరికి పెద్దభార్య భాగం వేపు న్న కొమ్మలు బంగారపు పువ్వులు పూచేవి. చిన్నభార్య భాగంలో వున్న కొమ్మలు, మామూలు పారిజాతంపువ్వులే పూచేవి. రోజూ బంగారంపువ్వులు దొరకడంవల్ల కొన్నాళ్లకి పెద్దభార్య భాగ్యవంతురాలై పోయింది.

కొంతకాలం గడిచింది. పారిజాతం చెట్టు తూర్పుకొమ్మలకి బంగారుపూలు పూస్తున్నాయని చిన్నభార్య చెవిని పడింది. తనకి భర్త అన్యాయంచేసి పనికిరానిభాగం ఇచ్చాడనుకొని, భర్త యింటికి రాగానే, "నాకు తూర్పుభాగం కావా"లని అడిగింది చిన్నభార్య.

"సరే. నీ యిష్టంవచ్చిన భాగం తీసుకో" అని సవరవాడు చిన్నభార్యకి ఆ భాగాన్ని యిచ్చేశాడు. పెద్దభార్య యిప్పుడు చెత్తతో నిండిన పడమటి భాగానికి వచ్చింది. మళ్లీ పూర్వంలాగే ఆమె ఇక్కడ కూడా శుభ్రంగా బాగుచేసి మారేడుచెట్టుని పూజించసాగింది.

మామూలుగా తెల్లవారేసరికి పెద్ద భార్య భాగంలో, మళ్లా బంగారుపూలు రాలుతూవుండేవి. "తెడ్డు ఎక్కడికెళ్లినా ఏగానే" అన్నట్టు, సోమరిపోతు అయిన చిన్నభార్య తూర్పుభాగాని కెళ్లినా, ఆమె ఆ చెట్టుని పూజించనూలేదు, ఆమెకి బంగారు పూలు దొరకనూలేదు.

ఓ రెండురోజులు పోయాక, చిన్నభార్య పొద్దున్నే లేచి పెద్దామె బంగారం పువ్వులు కోసుకుంటూ వుండడం



చూచింది. చిన్నభార్యకి మళ్లా అసూయ కలిగి, ఈ బంగారంపువ్వుల సంగతి భర్తకి చెప్పి, రోజూ ఆ పువ్వులు దొంగతనంగా తనకి తెచ్చియిమ్మంది భర్తని.

సవరవాడికి దొంగతనం యిష్టం లేక పోయింది. "నే తెచ్చియివ్వను" అనేశాడు. చిన్నభార్య రోజూతెమ్మని, నానా హంగామా చేస్తూండేది యింట్లో. ఇంక సవరవాడు ఆమెబాధ భరించలేక "ఈ చెట్టు వుండటంమూలానేగదా యిన్ని తగవులు వస్తున్నాయి" అని ఆలోచించి, గొడ్డలి పుచ్చుకుని ఆచెట్టు మొదటికే నరికివేశాడు.



రెండుచెట్లూ కలిసి పుట్టటం మూలాన, పారిజాతంచెట్టుతోపాటు, మారేడు చెట్టు కూడా పడిపోయింది.

ఆ మారేడుచెట్టు పడిపోగానే, దాని మొదల్లోంచి రక్తం చిమ్మింది. "చెట్టులో నించి రక్తం చిమ్మడం ఏమిటి?" అని ఆశ్చర్యంగా చూశాడు సవరవాడు. ఏమీ కనపడలేదు. గునపము తెచ్చి కొంచెం చుట్టూ తవ్వాడు. "ఓసేవ్! దేవుణ్ణే నఱికేశానే అమ్మో!" అంటూ తుళ్ళిపడి యింట్లోకి పరిగెత్తాడు. ఈ ఆశ్చర్యం చూడ్డానికి, భార్య లిద్దరూ పరిగెత్తుకువచ్చారు.

అక్కడ ఒక "ఈశ్వరలింగం" వుంది. దానికి నోరూ, ముక్కూ, కళ్లూ, సరిగ్గా మనిషికున్నట్టేవున్నాయి. గొడ్డలితో నఱకడం మూలాన తలమీద చిన్న గాయం పడి, రక్తం కారుతున్నదికూడా పాపం ఆ ఈశ్వరుడికి. అయ్యో దేవుణ్ణి నరికామే అని చాలా విచారించి, దంపతులు ముందు ఆ గాయం కడిగారు. తక్షణమే సవరవాడు అడివికి పోయి, తనకి తెలిసిన మందు ఆకులూ మూలికలూతెచ్చి, పసరు పిండి, గాయానికి పూశాడు.

"అయ్యో దేవుణ్ణి కొట్టానుగదా, దేవుడేం చేసిపోతాడో!" అని భయపడ్డాడు పాపం సవరవాడు. ఎంత నిద్రపోదామన్నా నిద్ర పట్టలేదు. వాడికి చివరికి ఎల్లాగో, వేకువసమయాన్న చిన్న కునుకుపట్టింది.

కలలో ఈశ్వరుడు కనపడి "ఓయి సవరా! నువ్వేం భయపడకు. నే నక్కడ వున్నానని నీకుమాత్రం ఏం తెలుసు? పాపం, తెలీకచేశావు. రేపుదయాన్నే, నువ్వు ఇక్కడనుండి బసమార్చి, వేరే అడివికిపో. తర్వాత పట్టణానికిపోయి, రాజుగారితో

ఈ సంగతంతా చెప్పు. నీ దరిద్రం తీరి పోతుంది!" అని చెప్పి మాయమైనాడు.

కల వచ్చిన వెంటనే సపరవాడు కన్నులు నులుముకొంటూ లేచి, భార్య లిద్దరనూ లేపాడు. ఈశ్వరుడు చెప్పిన మాటలు వాళ్లకుచెప్పగానే వాళ్లుఆశ్చర్యం పొందారు. దేవుని మహిమలు తెలిసిన పెద్దభార్యకు ఇటువంటి కలలంటే ఎంతో నమ్మకం. అందుచేత ఒక్క క్షణమయినా ఆలస్యం చేయక ఈశ్వరుని ఆజ్ఞ శిరసా వహించాలని ఆమెభర్తని తొందరపెట్టింది.



తెల్లవారి లేవగానే, ఇంక ఆ స్థలంలో నిలవకుండా, భార్య లిద్దరనూ వెంటబెట్టు కుని సవరవాడు ఇంకో అడవికి కాపురం మార్చివేశాడు. ఈ విచిత్రాన్ని రాజుగారితో మనవిచేయటానికి ఆరోజే పట్నం వెళ్లాడు.

పట్టణంలో వున్నవాళ్ళంతా, సవరవాడు చెప్పిన కథ విని చాలా ఆశ్చర్యపోయారు చెట్టులో శివుడు వుండటం ఏమిటని. సవర వాడూ,పట్టణంలోప్రజలూ, అందరూ కలిసి కోటలోకి పోయి రాజుగారితో చెప్పారు. వాళ్లుచెప్పిన మాటలు వింటే, రాజుగారికి కూడా ఆశ్చర్యం వేసింది. చెట్టులో పుట్టిన శివుణ్ణి చూడటానికి రాజుగారు పెద్ద పరి వారంతో బయలుదేరారు.

ఆ అడవిలోంచి "వంశధార" అనే నది ప్రవహిస్తూన్నది. దాని ఒడ్డున ఒక చిన్న సవరపల్లె వుంది. రాజూ అతని పరివారమూ కూడా ఆ గ్రామానికి వెళ్లి, "ఆ దేవుడుండే స్థలం ఇక్కడి కెంతదూరం?" అని గ్రామ స్థులని అడిగారు.

"బాబూ! ఇక్కడి కింకా రెండుమైళ్ళ దూరముంది. అదుగో, ఆ దిక్కు చూడండి.



ఆ కనబడుతున్న శిఖరమే దేవాలయం" అన్నారా పల్లెవాళ్లు. అప్పుడే వుదయించిన సూర్యకాంతిలో, ఆ శిఖరం బంగారంలా మెఱుస్తున్నది. సవరవాడూ, రాజూ, పరివారం, అందరూ ఆశ్చర్యపోయారు, నిన్నటికి లేని గుడి యివాళటికెలా తయారయిందా! అని.

"ఆ గుడి ఎవరు కట్టారు?" అని రాజు పల్లెవాళ్లని అడిగాడు.

"బాబూ! అదేమో మేము ఎరగము, కాని నిన్నరాత్రి తెల్లవార్లూ అక్కడ పెద్దవెలుగు కనిపించింది. ఆ వెలుగుతో బాటు చాలా మంది జనం మాట్లాడిన సందడికూడా వినబడింది. మేము అందరం, అదేమిటో చూదామని, కొంచెందూరం పోయేసరికి దార్లో పులులూ,సింహాలూ ఎదురైమమ్మల్ని ముందుకి పోనిచ్చాయి కావు. అందుకని తిరిగివచ్చేశాము. వుదయం లేచి చూద్దుము కదా, అక్కడ గుడి కనపడింది! ఈవిధంగా గుడి కట్టడం మానవులవల్లకాదు. తప్పకుండా ఇది దేవతలు చేసిన పనే అనుకున్నాము. ఇంతే మాకు తెలిసినది" అని ఆ పల్లెవాళ్ళు చెప్పారు.

ఈ సంగతి వినేసరికి అందరికీ చాలా ఆశ్చర్యం వేసి, తొందరగా ఏరు దాటి ఆ గుడిదగ్గరకి పోయారు. ఆ గుడికి వెనుక భాగంలో పారుతున్న "వంశధార" నదిలో స్నానంచేసి అందరూ గుడిలో ప్రవేశించారు. లోపల రెండు వెండి దీపపు సెమ్మాలలో దీపాలు వెలుగుతున్నాయి. ఆ వెలుగులో ముఖంవున్న ఈశ్వరలింగం వాళ్ళకి కనపడింది. విగ్రహం తలమీదమాత్రం చిన్నలొట్ట కనపడింది. అదే సవరవాడు

నరకడంవల్ల ముక్కపోయిన జాగా అయి వుంటుందని అనుకున్నారు. ఇప్పుడు ఆ చుట్టుపక్కల మారేడుచెట్టుగానీ, పారిజాతం చెట్టుగానీ, సవరవాడి గుడిసెగానీ ఏమీ కనపడలేదు.

రాజుగారూ, వెళ్లిన జనం అంతా ఆ దేవునికి ముఖంవుంది కాబట్టి "ముఖలింగేశ్వరుడు" అని పేరు పెట్టారు. పువ్వులూ, పత్రీ, తెచ్చి భక్తితో పూజించారు. ఆ దేవునిపేర రాజుగారు చాలా ఆస్తి రాసి ఇచ్చారు.

అటువంటి గొప్పదేవుణ్ణి సవరవాడు ముందుగా చూశాడుకాబట్టి, వాడికి చాలా ధనం యిచ్చారు.

సవరవాడికి కలలో ఈశ్వరుడు కనపడి చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చినై. ఇదంతా దేవుని మహిమకదా అని వాడు ఎంతో సంతోషించి, అంతటినుంచీ గొప్ప ఈశ్వర భక్తునిగా మారిపోయాడు.

గుడి తయారుగానే వుంది కాబట్టి, రాజుగారు దేవునికి అనేకమంది అర్చకులను నియమించారు. ఆ అర్చకులందరకూ



అక్కడనే యిళ్ళు కట్టించి యిచ్చారు. ఇళ్లన్నీ చేరి అది ఒక గ్రామంగా తయారయింది. ఈవిధంగా వెలసిన ఆ గ్రామానికికూడా 'ముఖలింగం' అని రాజుగారు పేరు పెట్టారు.

సవరవాడు గుడిసె వేసుకుని నివసించిన ఆ అడవి ప్రదేశంలో ఈనాడు ఈశ్వరుని ఆలయం వెలిసింది. అక్కడ ఎల్లప్పుడూ అతివైభవంగా అర్చనలూ, అభిషేకాలూ జరుగుతూ వుంటాయి. శివరాత్రినాడు ముఖలింగేశ్వరుడికి

జరిగే గొప్ప వుత్సవం చూడటానికి రెండు కళ్ళూ చాలవన్నమాట.

*   *   *

కొంతకాలమయిన తరవాత, భూమి దున్నుకొనేవాళ్ళకీ, నూతులు తవ్వుకునే వాళ్ళకీ, ఎక్కడి కక్కడే బోలెడన్ని శివ లింగాలు కనపడుతూ వచ్చాయి. ఆ వూరి చుట్టూ, ఎక్కడ చూసినా శివ లింగాలే.

ఒక్కొక్క శివలింగానికీ "భీమేశ్వరుడు, సోమేశ్వరుడు" అంటూ పేర్లుపెట్టి, రాజు గారు ఎన్నో ఆలయాలు కట్టించారు. ఇప్పటికీ మనం వెళ్లిచూస్తే ఆ 'వంశధార' నది ఒడ్డునా, తోటల్లోనూ. కొన్ని ఇళ్ళల్లోనూ శివలింగాలు కనబడుతూనే వుంటాయి.

ఇక్కడ దొరికే లింగాలు కోటికి ఒక్కటి తక్కువగా వున్నవని ఆ గ్రామపెద్దలు అంటున్నారు. అదీగాక, వంశధారా నది గుడికి ముందుకాకుండా వెనుకవైపు ప్రవహించడంకూడా ఒక లోపమేనట. ఈ లోపాలే లేకుండావుంటే ఈ గ్రామంకూడా కాశీతో సమానమైన మహత్తు కలిగి వుండేది అని వారి వుద్దేశం.

మూడు సంవత్సరాలు వరసగా ముఖలింగేశ్వరుని దర్శనం చేసినట్టయితే కాశీవిశ్వేశ్వరుణ్ణి చూసినంత పుణ్యం వస్తుందనీ, మూడేళ్ళపాటు తప్పకుండా వంశధారా నదిలో మునిగితే గంగానదిలో స్నానం చేసిన పుణ్యం వస్తుందనీ అక్కడి ప్రజలు ఇప్పటికీ నమ్ముతున్నారు.

పాపలూ!—కాశీ వెళ్లక్కరలేకుండానే అక్కడకు వెళ్లినంత పుణ్యం సంపాయించుకోవటానికి ఇది ఎంతచక్కటి అవకాశం! ఈ క్షేత్రం మనకు దగ్గరగా ఉత్తర విశాఖలోనే వున్నది గనుక, ఆ ప్రాంతానికి వెళ్లినప్పుడు ముఖలింగేశ్వరుణ్ని తప్పక చూచిరండేం!






అనగనగా ఒకరాజూ రాణీ ఉండేవారు. వారికి ఇద్దరు కుమారులూ, ఒక కూతురు. రాజుమీద వారి కుటుంబానికే కాక ప్రజలకందరికీ కూడా చాలా ప్రేమ వుండేది. అతనిలాంటి మంచిరాజు లేడని పేరు తెచ్చుకున్నాడు. ఇలా వుండగా హఠాత్తుగా జబ్బుచేసి రాజు చనిపోయాడు. పాపం అతని భార్య బెంగచేత మంచం పట్టింది.

రాజ్యంలో ఉన్న పెద్దపెద్ద వైద్యులు అందరూ వచ్చారు. రకరకాల చికిత్సలు చేశారు. లాభం లేకపోయింది. మనోవ్యాధికి మందు ఎవ్వరు ఇవ్వగలరు?

ఇంతలో ఒకరోజున—

ఊళ్లోకి ఒక సాధువు దిగాడు. ఎక్కడ చూచినా రాణీగారి గొడవే! అది విని సాధువు ఆమెను చూద్దామనుకున్నాడు. అతన్ని కోటలో కాపలావాళ్లు పోనిస్తేగా? "అందరూ చూడట మయింది. నీ వల్ల నేమవుతుంది. పోవోయి" అని కసిరి కొట్టారు.

"అలా కాదు. మీరందరూ ఏనాడో ఆశ వదలుకొన్నారు కదా, ఇంతలో పోయిందేమున్నది, నన్నూ ఒక్కసారి చూడ నియ్యండి" అని సాధువు పట్టుపట్టాడు.

సరే, చివరకు సాధువుని రాణీగారి యెదుట పెట్టారు. అతను పరకాయించి చూచి, "అమ్మా! ఇది ఏమీ శరీరసంబంధమైన జబ్బుకాదు. అందుచేత యెన్ని మందులు నూరిపోసినా పనిచేయవు. మీకు యిప్పుడు పట్టుకున్నది మనోవ్యాధి. మనోవ్యాధులు కుదర్చటం ఒక్క సాధువులకే చేతనవుతుంది. ఇటువంటి బాధలు నయంకావటానికే వారు దేశదేశాలు తిరిగి సలహాలు ఇస్తూవుంటారు" అని తన వుద్దేశం చెప్పాడు.

కె. రాజు, బందరు



ఈ మాటలు రాణిగారికి అమృతగుళిక అనిపించినై. యతీశ్వరుణ్ని అనేకవిధాల పూజించి, "స్వామీ! మీరు నిజంగా మహానుభావులు. నా బాధలు ఉన్నవి ఉన్నట్టుగా దివ్యదృష్టివల్ల కనిపెట్టగలిగారు. మా పుణ్యంకొద్దీ యీవాళ మీ దర్శనం లభించింది. మరి,నాకుఆరోగ్యంకలిగే ఉపాయం ఉన్నదా ?" అని ఆత్రంతో ప్రార్థించింది.

"ఉపాయంలేకేమి ?— ఈ పట్టణానికి ఉత్తరదిశని పదిఆమడల దూరంలో ఒక రాక్షసి వున్నది.ఆ రాక్షసి రాజ్యంలో మూడు వింతవస్తువు లున్నాయి. అయితే, అవి జయించుకురావడం కష్టసాధ్యమైన పని. వాటిని తీసుకురాగలిగితే మాత్రం మీ జబ్బు నయమైపోయినట్టే. సందేహం లేదు. నా మాట నమ్మండి" అని సాధువు చెప్పాడు.

"మాకు ఏ పనీ కష్టసాధ్యమనేదిలేదు, ఆ వింతవస్తువు లేమిటో సెలవియ్యండి స్వామీ!" అని అంటూ రాణిగారి కొడుకు లిద్దరూ ముందుకు వచ్చారు.

"సరే, అయితే వినండి; ఆ రాజ్యంలో పాటపాడే చెట్టు - మాటలాడే పక్షి - బంగారపు నీళ్లు ఉన్నాయి. వీటిని తీసుకురాగలిగితే మీ తల్లిగారి జబ్బు నిమ్మళిస్తుంది. అయితే, ఈ పని చాలా జాగ్రత్తగా సాధించుకు రావాలి సుమండీ!" అని చెప్పేసి సాధువు మాయమైపోయాడు.

ముందుగా పెద్దకుమారుడు రాజభూషణుడు వెడతా నన్నాడు. "మూడు నెలలు గడువుపెడుతున్నాను. అప్పటికి ఇల్లు చేరుకుంటే సరేసరి. లేనిపక్షంలో నాకు ఏదో అపాయం సంభవించిం దనుకోండి" అని గడువు పెట్టి బయలుదేరాడు.

వెళ్ళగా వెళ్ళగా ఒక బ్రహ్మాండమైన యెడారి కనిపించింది. అక్కడ కొన్ని

రాళ్లు తప్ప మరేమీ లేవు. మరి నాలు గడుగులు వేసేసరికి "ఓయి రాజభూషణుడా! ఈ ప్రయాణం యెక్కడికి? ఇది యెందుకు వచ్చిన ప్రయాణం!!" అని ఎవరో తనని పేరుపెట్టి పిలిచినట్టయింది. ఎరిగివున్నవాళ్లు పలకరిస్తున్నారేమో పోనీ బదులు చెబుదామా అనే బుద్ధిపుట్టింది. కాని, ఇవన్నీ రాకసిరాజ్యంలో మాయలని నిశ్చయించి, రాజభూషణుడు తన దారిని తను వెళుతున్నాడు.




దారిలో ఒక వృద్ధుడు కనపడినాడు. "నాయనా రాజకుమారా! నువు చాలా కష్టసాధ్యమైన కార్యం తలపెట్టావు. ఐనా భయంలేదులే. నేను చెప్పినట్టుగా నడుచుకున్నావంటే సులువుగా పని సాధించుకు రాగలవు" అని చెప్పాడు.

"తప్పకుండా నడుచుకుంటా"నని రాజభూషణుడు మాట యిచ్చాడు.

అప్పుడు వృద్ధుడు— "అదుగో ఆ కనపడుతున్న రాళ్లన్నీ యేమిటో తెలుసా? నీలాగనే, నువు వచ్చిన పనికోసమే వచ్చి, శాపంవల్ల శిలలుగా మారిపోయిన శూరులు. నీవు ఆ సమీపానికి వెళ్లేసరికి ఎవరో నిన్ను పేరుపెట్టి పిలుస్తారు. పలకకుండాపోతే రాళ్ళతో కొడతారు. అప్పటికీ లొంగకుండా పోతే యెదటికి వచ్చి ముఖంపైన ఉమ్ముతారు కూడాను. ఈ పనులన్నీ కనపడని ఒక రాకసి చేస్తూవుంటుంది. ఇవేవీ లెక్కచేయక నీ పనిమీద నీవు వెళ్లిపో. వెనకకు తిరిగిచూశావంటే నువ్వూ ఒకరాయిగా మారిపోతావు" అని బోధించాడు.

ముసలివాడు చెప్పింది శ్రద్ధతో విని, రాజభూషణుడు మళ్లీ బయలుదేరాడు. కొంతదూరం వెళ్లేసరికి యెవరో పేరుపెట్టి పిలిచారు. రాజపుత్రుడు పలకలేదు. వాళ్లు రాళ్లు విసిరారు, అతను లెక్కచేయలేదు. తల్లి ఆరోగ్యంకోసం యెన్ని కష్టాలైనా పడ




టానికి నిశ్చయించుకున్నాడు. మరికొంచెం సేపటికే ఎవరో వచ్చి ముఖంపైన ఉమిసే సరికి, చర్రున కత్తిదూసి, 'యెవడవురా నువ్వు?' అంటూ వెనక్కి తిరిగాడు. ఇంకే ముంది! రాజభూషణుడికి బదులు ఒక రాయి అక్కడ పడివున్నది!!

మూడునెలలవరకూ చూసి, రాజభూష ణుడు ఏదో ఆపదలో చిక్కుకొని వుంటా డని ఇంటిదగ్గర నిశ్చయించుకున్నారు. ఈ సారి రెండవవాడు సుగుణభూషణుడు అన్నలాగానే మూడునెలలు గడువు పెట్టి ప్రయాణమైనాడు. ఇతను అన్నకంటె యెక్కువ ఓరిమి కనబరిచాడు. చాలా శ్రమలు పడినాడు. కాని చివరకు యెవరో వచ్చి ముఖంపైన ఉమిసేసరికి, పౌరుషంతో కత్తిదూసి, వెనకకు తిరిగి, అన్నగారిలాగానే శిల అయిపోయాడు.

పెట్టిన గడువు ఎప్పుడో దాటినా సుగుణ భూషణుడు ఇంటికి చేరుకోలేదు. అందుచేత యితనికి కూడా ఆపద వచ్చి వుంటుందని ఇంట్లో నిశ్చయించుకున్నారు.

అప్పుడు రాజపుత్రి హేమలత నేను వెళ్లు తానని ముందుకు వచ్చింది. కొడుకుల అతీ గతీ తెలియకపోయె. ఉన్న ఒక్క కూతురూ ఎదట లేకుండా వెళ్లిపోతే రాణి సహించ గలదా? అందుచేత వద్దుగాక వద్దు అని ఆమె హేమలత ప్రయాణానికి అడ్డు తగి లింది. కాని, రాజకుమార్తె ఆగలేదు. "ఈపాటి పని నెరవేర్చుకు రాలేకపోతే మేము ఉండేమి, లేకేమి? నేను తప్ప కుండా సాధించుకు వస్తాను. చూస్తావుగద నా ప్రజ్ఞ!" అని ధీమాగా చెప్పి బయలు దేరింది.

అన్న లిద్దరకూ కనపడినట్టే, హేమ లతకు కూడా ముసలివాడు అగపడి సల హాలు చెప్పాడు. రాజపుత్రి ముసలివాడిని దేముడిగా భావించింది. అతని సలహాలను

వేదముగా నమ్మింది. అతను చెప్పినదానికి అడుగుదాటకుండా నడుచుకుంటానని ఒట్టేసుకుంది. ఆ ప్రకారమే చేసింది.

లోగడ అన్నలు పొరుషపడి వెనక్కు తిరిగి చూచారు. తగిన శాస్తి అనుభవించారు. కాని, హేమలతమాత్రం అలా చూడలేదు. అందుకనే ఆమె గండాలన్నీ సుళువుగా దాటేసింది. ఇక యిప్పుడు— ముసలివాడు హేమలతకు అడుగడుగునా కనపడుతూనే వున్నాడు. పక్కనే వుంటూ, సలహాలు చెప్పుతూనే వున్నాడు.

కొంచెంసేపటిలోనే హేమలతకు ఒక చిత్రమైన ప్రదేశం కనబడింది. అక్కడ మిల మిల మెరుస్తూ ఊటనీరు ప్రవహిస్తున్నది. 'అదే బంగారపు నీరు, ఇది వక చుక్క తగిలేసరికి చచ్చినవాళ్లే బ్రతుకుతారు; ఇక ఎటువంటి వ్యాధులైనా కుదురుతాయనే మాట చెప్పేదేమిటి ?' అని ముసలివాడు అన్నాడు. ఆ మాట వింటూనే, హేమలత తనదగ్గర వున్న సీసాలను ఈ నీటితో నింపివేసి, చేత పట్టుకున్నది.

ఆ దగ్గరలోనే ఒకచెట్టు పాడుతున్నది. చెట్టుకొమ్మకు ఒక పంజరం, ఆ పంజరంలో మాటలాడే పక్షికూడా ఆమెకు కనపడ్డాయి. 'భేష్! తక్కిన రెండు వస్తువులూ ఇక్కడనే దొరికేశాయి. ఇక వచ్చిన పని పూర్తిగా నెరవేరినట్టే' నని రాజపుత్రి సంతోషించింది.



"ఈ చెట్టుకొమ్మ ఒకటి పట్టుకువెళ్లి మీ ఉద్యానవనంలోపాతు, మళ్లీ మహావృక్షమవుతుంది. దీని ఆకులు చక్కటి సంగీతం పాడుతయి. పంజరంలో పక్షి కమ్మటి కథలు చెబుతుంది. ఇవి ఎక్కడ వుంటే అక్కడ ఆరోగ్యం వుంటుంది," అని వృద్ధుడు మళ్లీ చెప్పాడు.

హేమలత ఆ చెట్టుకొమ్మ ఒకటి విరిచింది. పక్షి వుండే పంజరం పట్టుకొన్నది.

ఇంటిముఖం పట్టింది. ముసలివాడు చెప్పిన మాట ఎంతవరకు నిజమో చూతామని, దారిలో పడివున్న ఒక శిలమీద బంగా రపు నీటిచుక్క వేసింది. ఆ శిల వెంటనే రాజకుమారునిగా మారింది. ఆమె ఆశ్చ ర్యంతో తక్కిన రాళ్ళమీద కూడా తల కొక నీటిచుక్క వేస్తూ వచ్చింది. వెంటనే రాళ్ళన్నీ రాజపుత్రులుగా మారినై.

అలా మారిపోయి వచ్చిన వాళ్ళలో తన అన్నలిద్దరూ కనపడేసరికి హేమ లత చెప్పలేని ఆనందం పొందింది. ముగ్గురూ కలిసి, తల్లికి కావలసిన మూడు వింతలూ పట్టుకుని ఇంటికి చేరుకున్నారు. తలవని తలంపుగా కొడుకులూ, కూతురూ కంటపడే వరకు రాణిగారికి సగం వ్యాధి ఎగిరిపోయింది. హేమలత ప్రజ్ఞవల్ల సాధిం చుకు వచ్చిన మూడు వింతలూ యతీశ్వ రుడు చెప్పినట్టుగా ప్రయోగించేసరికి, రాణి గారికి చక్కగా ఆరోగ్యం చేకూరింది.

అందరూ ఆనందంలో మునిగి వుంటుం డగా అడవిలో కనిపించిన ముసలివాడు కూడా వారి దర్బారుకు వచ్చాడు. అతన్ని రాజకుమారులూ, హేమలతా చాలా మర్యాద చేశారు. అతను కట్టుకోవటానికి మంచి దుస్తులు యిచ్చారు. అవి వేసుకో గానే ముసలివాడు చక్కటి రాజకుమా రునిగా మారిపోయాడు. ఈ వింతకు అందరూ ఆశ్చర్యం పొందారు.

"నేనూ మీవంటి రాజకుమారుడనే. ఈ మూడు వింతలకోసం నేనూ మీ లాగానే ప్రయాణమయ్యాను. రాక్షసుని శాపంవల్ల నాకీ ముసిలిరూపం వచ్చింది, తర్వాత హేమలత ప్రజ్ఞవల్ల నాకీ పీడ వదిలింది," అని అతను చెప్పాడు.

ఈ కథ విని రాణీగారు మరింత సంతో షించింది. హేమలతకూ, రాజకుమారునికీ వైభవముగా పెళ్లిచేసింది. అంతటినించీ అందరూ హాయిగా వుంటున్నారు.





# గొల్లవాడు-విద్వాంసుడు

ఒక వూళ్లో ఒక సంగీత విద్వాంసుడు ఉండేవాడు. ఆయనకు చాలా రాగాలు వచ్చునట. ముఖారిలాటి ఏడుపు తెప్పించే రాగాలు మరీ బాగా పాడగలడట.

మరి, ఇంత గొప్ప విద్వాంసుడు మారుమూల పల్లెటూరిలో ఉండటంచేత, ఆయన తెలివితేటలు లోకానికి తెలియకుండా పోయినయి. అందుకని, దగ్గరనే పట్టణంలో వుండే రాజుగారి దర్శనం చేసుకొని, పాటకచేరీ పెట్టించి, గొప్ప బహుమతీ పొందుదామని ఆయన బయలుదేరాడు.

దారిలో ఒక అడవి ఉన్నది. పట్టణం చేరుకోవాలంటే ఆ అడవి దాటాలి. విద్వాంసుడు అడవికి చేరి ఎండగా వుంటే కాసేపు విశ్రాంతి తీసుకుందామని చెట్టుక్రింద కూర్చున్నాడు. ఇంతలో ఒక గొర్రెల కాపరి గొర్రెలను మేపుకుంటూ అటువచ్చాడు. అతన్ని చూడగానే విద్వాంసుడికి ఒక ఆలోచన పోయింది: "ఈయనచాలా ధనవంతుడై ఉండాలి. లేకుంటే అబ్బో, ఇన్ని వందల గొర్రెలను ఎలా సంపాయించగలడు? మచ్చుకి రెండు రాగాలు పాడి, ఈయనని మెప్పించినట్టయితే ముందు ఇక్కడే బహుమతి పుచ్చుకోవచ్చు" అని ఆశపడి, విద్వాంసుడు సంగీతం ప్రారంభించాడు.

విద్వాంసుడు పాడుతూవుంటే, సంతోషించటానికి బదులు, గొర్రెలకాపరి ఏడుపు మొదలెట్టాడు. ఇది చూచి విద్వాంసుడు "ఈయన శ్రీమంతుడే కాదు, శాస్త్రం తెలిసిన పండితుడు కూడాను. కనుకనే నాపాటలో స్వారస్యం కనిపెట్టి కళ్ల నీళ్లు పెట్టుకొంటున్నాడు" అని తలిచి యింకా గొంతెత్తి పాడుతున్నాడు. విద్వాంసుడు పాడినకొద్దీ గొర్రెలకాపరి దుఃఖం అంతకంతకు ఎక్కువవుతున్నది.

జె. రామచంద్రరావు, సైదాపేట

ఈ యేడుపేమిటో అర్థంగాక, విద్వాంసుడు పాడటం ఆపివేశాడు. "ఏమండి స్వామీ! నేను పాడిన పాటవల్లనే మీకు హృదయం కరిగి, కళ్ళ నీళ్ళు పెట్టుకుంటున్నారా? ఏమిటి కారణం?" అని గొర్రెలకాపరిని అడిగాడు.

గొర్రెలకాపరి యేడుపు దిగమింగి, "అది కాదయ్యా. నువ్వు పైకి లక్షణంగానే కనపడుతున్నావు. ఏ లోటూ లేని ఇటువంటి వాడు ఇందాకటినుంచి ఎందుకు ఏడుస్తున్నాడా అని అనుకుని నీతోపాటు నేనూ ఏడుస్తున్నాను" అని సమాధానం చెప్పాడు.

"నాకు ఏ లోటూ లేదంటారా? డబ్బు లేక నేను ఎంతబాధపడుతున్నానో మీకేం తెలుసు? ఏదో గొప్పవారు, పండితులు, రెండు రాగాలు పాడితే మెచ్చుకుని బహుమతి యిస్తారని నేనాశపడుతూ వుంటే, ఇదేమి ఏడుపండీ, అర్థంలేని యేడుపూ?" అని విద్వాంసుడు మనస్సులో బాధ బయటపెట్టాడు.

అప్పటికీ గొల్లవాడి దుఃఖం ఆగలేదు. ఇంకా ఏడుస్తూనే "అర్థం గాక పోవడమేమిటయ్యా స్వామీ!— నిన్నటి రోజున నా మందలో ఒక గొర్రె నీలాగనే వెర్రి కేకలుపెట్టి చచ్చిపూరుకుంది. నీపని కూడా అంతే అవుతుందేమోనని భయమేసి, యేడుస్తున్నానయ్యా" అని బదులు చెప్పాడు.

"అయ్యో, నా తెలివి కాలా! నా సంగీతమంతా చివరికి అడవికాచిన వెన్నెల మోస్తరు అయిందే! ఈ మూర్ఖుడికి నాపాట వినిపించి గొంతుకంతా పాడుచేసికొన్నాను" అని గొణుగుకొంటూ, విద్వాంసుడు తన దారిని తను పోయాడు.





"ఏయ్! పోలీసూ! మానాన్న పిప్పరమెంట్లు కొనుక్కుంటానంటే డబ్బివ్వనన్నాడు గాని, వచ్చి పట్టుకుపో!"

## ముగ్గు



కె. శారద, విశాఖపట్టణం.

## చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

### ఆధారములు

**అడ్డము :**

1. గాంధి మహాత్ముడు
3. సుభాస్‌చంద్రబోసు
6. శరీరములో ఒకభాగం
8. జ్వరము వచ్చినపుడు త్రాగుదురు
9. నీటిలో పుట్టెడి పువ్వు
11. జుట్టులో జీవించును
12. ముని
14. ఉద్దేశము
17. బంగారము మొదలైనవి దొరకుచోటు
19. శరీరము
20. వాద్యవిశేషములు
21. కాంతి




**నిలువు :**

1. వాద్యవిశేషములు
2. పుష్పములు
4. క్రొత్త
5. ప్రాణము
7. విషజంతువు
9. కొండ
10. ఈడు
13. కాచిన పాలపై ఏర్పడును
15. హాసము
16. మన భాష
18. అగ్ని
19. ఉపకారము




# పిల్లల పెంపకం

"మా పాపాయి బుద్ధిమంతుడమ్మా" అని చెప్పుకోటానికి ఏ తల్లికయినా సంతోషంగానే వుంటుంది. అయితే, పాపాయి బుద్ధిమంతుడు కావాలంటే పెద్దవాళ్లు ఎంత శ్రద్ధ తీసుకోవాలి ?— అనుకొంటామేగాని, అది అంత తేలికయిన పని కాదు.

పెద్దవాళ్లు పలికేపలుకులూ, చేసేపనులూ పాపాయికి జీవితంలో వరవడి అన్నమాట. ఒక్కమాటలో చెప్పాలెనంటే, పాపాయిని మంచివానిగాగాని చెడ్డవానిగాగాని తయారు చేసే బాధ్యత పెద్దలమీదనే వున్నది. అందుకనే పాపాయిని మనం ఎల్లప్పుడూ చాలా ప్రేమతో, దయతో చూడాలి - అలా వున్నప్పుడే అతనికి మనపైన భక్తి కుదురుతుంది.

"మా నాన్న చాలా మంచివాడు. ఎంచక్కా నాకు పిప్పరమితాయిలూ బిస్కత్తులు తెచ్చిపెడతాడు"అని చెప్పి పాపాయి సంతోషించా డనుకోండి. నిజానికి ఇది పాపాయి జీవితంలో పెద్ద మార్పు తెస్తుంది. నాన్న తనకు ఇచ్చినట్టే, తనుకూడా యితరులకు యిస్తూవుండాలనే జ్ఞానం పాపాయి మనస్సుకి తట్టుతుంది. అందుకనే కాబోలు, పిల్లలను చూడబోయేటప్పుడు ఉత్తచేతులతో పోరాదని మన పెద్దలు అంటారు.

పాపాయి ఈ లోకంలో నేర్చుకోవలసిన సంగతులు ఎన్నో వున్నాయి. అందుచేత పెద్దవాళ్లు పనిలోవున్నా సరే, తెలుసుకోవాలనే ఉత్సాహంలో పాపాయి అస్తమానం ఏదోఒకటి అడుగుతూనేవుంటాడు. మనం విసుక్కోకూడదు. వాడు అడిగిన ప్రశ్నలకన్నిటికి జవాబులు ఓర్పుతో చెప్పాలి. అప్పుడే వాడు చాలా శ్రద్ధతో ప్రతిదీ నేర్చుకుంటాడు.

అంతే కాదు. పాపాయి శరీరమూ, మనస్సూ కూడా ఎల్లప్పుడూ నిర్మలంగా వుంచాలి. అలా వుంచటంలో పెద్దలు పాటించవలసిన విధులు ఎన్నో వున్నాయి. వాటినన్నిటినీ చందమామలో నెలనెలా చెబుతూ వుంటాను.

---

మీ పెద్దమ్మ

---



పైనవున్న చదరం మధ్యకి ఏ దారిన పోయి కప్పు ఎలా తెచ్చుకోవాలో ఈ నలుగురు పిల్లల్లో ఒకళ్లకిమాత్రమే తెలుసు. ఆ పిల్లవా డెవరో కనుక్కోండి.




10-వ పేజీలోని చిక్కు బొమ్మలకు

జవాబు:

2, 10 నెంబర్లు గల కుక్కపిల్లలు రెండూ తేడాగా ఉన్నాయి.

53-వ పేజీలోని యుక్తిలెఖ్ఖకు జవాబు:

పళ్ళ అబ్బి దగ్గిర మొత్తం 119 మామిడిపళ్లు వున్నయి.



# విజ్ఞానంలోని గమ్మత్తులు

పాపాయిలకు సరదాఅయిన పండగలలో దీపావళి ఒకటి. అవునా?— ఆనాడు పిండి వంటలతో భోజనంచేయుటమే కాకుండా, చీకటి పడగానే టపాకాయలు, మతాబీలు, కాకరపువ్వత్తులు, ఇంకా ఎన్నెన్నో తమాషాలు వేడుకగా కాలుస్తారు.

అయితే, దీపావళిసామానులు బజారులో కొనుక్కోవాలంటే బోలెడంత సొమ్ము పెట్టాలి. అలా అక్కరలేకుండా కొద్దిపాటి ఖర్చుతో దీపావళిసరదా తీరే గమ్మత్తులు కొన్ని చెప్పుతాను. ముందు పువ్వులు తయారు చేయటం తీసుకుందాం.

దీనికి కావలసింది ఒక బుడ్డీదీపం, అల్యూమినమ్ రజను. ఈ రజను కొంచెం కొంచెంగా దీపంమీద చల్లుతూవుంటే తెల్లటి వెండిపువ్వులు రాలుతాయి. ఉక్కు తాలూకు రజను వేసినట్టయితే బంగారురంగు పువ్వులు రాలుతాయి. అదీ యిదీ కలిపి చల్లినట్టయితే, వెండీ బంగారు పువ్వులు కలిసి, చూడ ముచ్చటగా కనబడతాయి.



మామూలు గుగ్గిలం తెచ్చి పొడిచేసి, అది మంటమీద వేస్తే, జాంమ్మని జ్వాలవచ్చి చిత్రమయిన పువ్వులు పడతాయి. ఇంతెందుకూ, బొగ్గు తెలుసుకదూ? ఆ బొగ్గుపొడి మంటపైన వేసినాసరే, కావలసినన్ని పువ్వులు రాలుతాయి.

ఇప్పుడు చెప్పినవన్నీ కంటికి అందమిచ్చే వస్తువులు. మరి, దీపావళి వేడుకకు ధ్వని చేసే వస్తువులు కూడా అవసరమే. ఖర్చు అట్టేలేనిది మచ్చుకు ఒక్క గమ్మత్తు మాత్రమే చెబుతా: మనము రోజూ వాడుకొనే ఉప్పు యింత తీసుకొని పెనంలో పోయండి. టప్ టప్ మని శబ్దంచేస్తూ, వద్దు అనేవరకు అది పేలుతూనే వుంటుంది.

నేను చెప్పినట్టుగా ఇవన్నీ చేసిచూడండి, ఎంత సరదాగా వుంటుందో! కాని... నిప్పుతో చెలగాటం పనికిరాదు, జాగర్త సుమా!!—



# అంకెల తమాషాలు





## అంకెల గోపురము

$$
\begin{aligned}
0 \times 9 + 8 &= 8 \\
9 \times 9 + 7 &= 88 \\
98 \times 9 + 6 &= 888 \\
987 \times 9 + 5 &= 8888 \\
9876 \times 9 + 4 &= 88888 \\
98765 \times 9 + 3 &= 888888 \\
987654 \times 9 + 2 &= 8888888 \\
9876543 \times 9 + 1 &= 88888888 \\
98765432 \times 9 + 0 &= 888888888
\end{aligned}
$$

---

## ఈ లెక్క చేయండి

ఒకనివద్ద బుట్టెడు మామిడిపళ్లు ఉన్నాయి, కాని అవి ఎన్నో అతనికి లెక్క తెలియదు. అతనికి పది అంకెలవరకు మాత్రం లెక్కించటం తెలుసు. 'బుట్టలో మామిడిపళ్లు ఎన్ని ?' అని అడిగితే అతనిలా చెప్పాడు :

రెండేసి పళ్లచొప్పున పోగులు పెడితే, ఒకపండు మిగులుతుంది,
మూడేసి పళ్లచొప్పున పోగులు పెడితే, రెండుపళ్లు మిగులుతై,
నాలుగేసి పళ్లచొప్పున పోగులు పెడితే, మూడుపళ్లు మిగులుతై,
అయిదేసి పళ్లచొప్పున పోగులు పెడితే, నాలుగుపళ్లు మిగులుతై,
ఆరేసి పళ్లచొప్పున పోగులు పెడితే, అయిదుపళ్లు మిగులుతై,
ఏడేసి పళ్లచొప్పున పోగులు పెడితే, ఏమీ మిగులవు,
ఎనిమిదేసి పళ్లచొప్పున పోగులు పెడితే, ఏడుపళ్లు మిగులుతై.

మరి, అతని బుట్టలోవున్న మామిడిపళ్లు ఎన్నో మీరు చెప్పండి చూతాం.

మీరు చెప్పలేకపోతే జవాబుకు 51-వ పేజి చూడండి.

# అట్టమీది బొమ్మ

కంసుడు మధురాపట్టణానికి రాజు. అతని చెల్లెలు దేవకి. కంసునికి చెల్లెలు అంటే చాలా ప్రాణం. అందుచేత ఆమె వివాహం చాలా గొప్పగా చేశాడు. ఆమె, ఆమె భర్త వసుదేవుడు ఎక్కిన రథాన్ని తనే నడుపుతున్నాడు.

ఊరేగింపు సాగుతూవుండగా ఒక అశరీరవాణి "ఓయీ కంసుడా! చూడగా నీవు వట్టి అమాయకునిలా ఉన్నావే. ఏ చెల్లెలిపయిన అభిమానపడి ఇప్పుడు రథాన్ని స్వయంగా తోలుతున్నావో, ఆ దేవకిదేవి కడుపున పుట్టే ఎనిమిదో శిశువు నిన్ను చంపి వేస్తాడు సుమా. ఏమరక, జాగ్రత్తగా ఉండు!" అని పలికింది.

ఈ మాటలు చెవినిపడగానే మారు ఆలోచన లేకుండా కంసుడు చర్రున కత్తి దూసి, దేవకిని నరకబోయాడు. వసుదేవుడు అడ్డువచ్చి "బావా, నీకు నీ చెల్లెలు ఏమీ అపకారం చేయలేదుకదా. ఆమెకు పుట్టిన ఎనిమిదో బిడ్డకదా అపకారం చేసేది? అలాంటప్పుడు ఆమెకు పుట్టిన బిడ్డలనందరిని నీకే వప్పగిస్తాము. నీ చెల్లెలిని వదలి పెట్టు" అని బతిమలాడాడు.

అప్పటికి కంసుని కోపం తగ్గింది. 'సరే'నని వప్పుకొన్నాడు. కొంత కాలానికి దేవకి కడుపున ఒక కొడుకు పుట్టాడు. మాటప్రకారం వసుదేవుడు కొడుకును కంసునికి ఒప్పగించాడు. కంసుడు వసుదేవుని నీతికి మెచ్చుకొని 'వద్దులే, తీసుకువెళ్లు' అన్నాడు. దీనికి వసుదేవుడు సంతోషించలేదు. ఏ నిమిషాన కంసుడి బుద్ధి మారుతుందోనని అతనికి అనుమానమే. ఇలా వసుదేవుడికి ఏడుగురు కొడుకులు పుట్టారు. వారినెవ్వరినీ కంసుడు తాకలేదు.

ఇంతలో ఒకనాడు నారదుడు కంసుడివద్దకువచ్చి, 'నందుడు, వసుదేవుడు, వారి పరివారమూ కలిసి నీ కుటుంబానికే ఊరూ పేరూ, లేకుండా చూడాలని ఏర్పాట్లు చేస్తున్నారు' అని చెప్పాడు.

ఇది వినేసరికి కంసుని హృదయంలో అణిగిపోయిన కోపం మళ్లీ రేగింది. దేవకిదేవికి పుట్టిన ఏడుగురు కొడుకులనూ కనికరంలేకుండా వెంటనే చంపి, చెల్లెలనూ బావనూ తన కోటలోనే బంధించివేశాడు.

ఎనిమిదో కాన్పుకి కేవలము విష్ణుమూర్తే దేవకి కడుపున జన్మించాడు. ఆ శిశువుకు విష్ణువుకి ఉన్నట్టుగానే నాలుగుచేతులూ, చేతులలో శంఖం, చక్రం, గద, పద్మమూ ఉన్నాయి. కుండలాలు, మణిహారము మొదలయిన అలంకారాలతో అతను ప్రకాశిస్తూవున్నాడు! దంపతులు బంధింపబడిన ఆ కోటలోనే విష్ణుమూర్తి వారికి ప్రత్యక్షమై, కంసుని చేతికి చిక్కకుండా శిశువును గోకులంలో వున్న నందుని యింటికి తీసుకుపొమ్మన్నాడు. దోవలో నీకేమీ యిబ్బందులు లేకుండా చూస్తానని చెప్పి మాయమయినాడు.

Printed and Published by B.N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras
Editors: CHAKRAPANI and K. RAJA RAO.



Chandamama Jan. '49

Photo — British Information Service

అక్క చెల్లెళ్లు

CHANDAMAMA JANUARY 1949 Regd. No. M. 4854



"ఎట్లా ఇప్పుడు ఇంట్లోకి పోవటం? గుడ్డలు మట్టి అయితే అమ్మకొట్టదూ!"